(నూతన సాంఘిక నాటకము)


రచయిత:

శ్రీ వేదాంతకవి


# [illegible]






ప్రకాశకులు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

1954




[ వెల రు 1—8—0

# వినండి

**1**

ప్రేగులుమాడి, మూతపడి
ఱెప్పలు, నోర్వడియారి పిచ్చిబై
రాగిగ వీధిలోఁబడి చ్చి
రాకు పరాకతిమై విపంచికా
రాగ సుధాతరంగములు
ప్రాణము తీయఁదొడంగు వేళయే
త్యాగము చేసి నా తెనుఁగు
తల్లిని గంటినో యేడ్చుచుంటిరా ?

**2**

ఈ నిర్భాగ్యుని కొంపలోఁ బడి కళా
హేలాలతాతన్విమై
నానాలంకృత ముగ్ధమై మరియు యీ
నా తెన్గుతల్లిన్ గటా
యే నీచుల్ కలికాల కీచకులుగా
నేడ్పించుచున్ దుఃఖ గం
గా నిర్ఘోష గభీర నిర్ఝరణి లో
నన్ ద్రోసిరో గాంచరే ?

వేందాత కవి.

# ఎన్నటికి మఱవని మేలు

నన్ను చిరకాలం పోషించుకోగల కాశీనాథుని నాగేశ్వరరా పంతులుగారు స్వర్గస్థులైన తర్వాత దిక్కు మొక్కు లేక యెంతో కష్టజీవయాత్రలో బడి నలిగిపోతూ, శ్రీ పంతులుగారి అల్లుళ్లైన ఆంధ్ర పత్రికా సంపాదకుల కంటబడి యెన్నటికి తడియారని కళ్ళు మూతలు పడి బైరాగినై వీధిలోపడ్డాను. గ్రామదేవతమాదిరి గ్రామగ్రామాల మీద తిరగబడ్డాను. బక్క చిక్కి పోతున్నాను. ఇంతలో వేటపాలెం గ్రామ కాపురస్థులు, కమ్మని కమ్మవంశోద్భవులు చల్లని అవ్యాజ కరుణా కటాక్షంతో ఆహ్వానించి, అభిమానించి, నా తెనుగుతల్లి ప్రాణం పోశారు. నా హృదయశయ్యపై ఆ తెనుగు తంత్రుల్ని చేర్చి కమ్మని కవితా ప్రసూనాలచే పూజించుకొందును.

వేదాంప కవి.

# ఇదిగో

తెనుఁగు బిడ్డ! తెనుఁగుతండ్రి! తెనుఁగుదొర! ఇంకా ఈనాడు కూడా పాచిపోయిన పురాతన నాటకాన్ని చూస్తుండాల్సిందేనా ?

నీలో నుంచి క్రొత్త తేజస్సును రప్పించటానికి యే నాటకాలవసరమో, యే ప్రళయ సంఘట్టన ఘట్టా లవసరమో పరీక్షించుము.

ఆంధ్రపౌరుషం, ఆంధ్ర శౌర్యం, ఆంధ్ర కళాచాతుర్యం ఛాలెంజి చేసి ప్రదర్శించటానికి తెనుఁగు తల్లి వచ్చింది. తెనుఁగు బిడ్డడి వీరసింహ కిశోర గర్జన దశదిశల పిక్కటిల్ల జేయటానికి వచ్చింది. కష్టజీవాల త్యాగశీలాలు సాక్షాత్కరింపఁ జేయటానికి పరవళ్ళు త్రొక్కుతూ వచ్చింది. ఆంధ్రజాతి నిర్వక్ర పరాక్రమ పతాకం నిలపెట్టటానికి వచ్చింది.

తెనుఁగు రాజ్యం కావాలన్నా, తెనుఁగు భాష కావాలన్నా, తెనుఁగు గడ్డపేరు నిలపాలన్నా, తెనుఁగుతల్లిని పూజించాలన్నా తెనుఁగు వాణ్ణని గర్వించాలన్నా, ప్రతి తెనుఁగు సోదరుడూ యీ తెనుఁగు తల్లి నాటకాన్ని తప్పక చూడాలి అభిమానించాలి.

వేదాంత కవి.

# దో సి లి

కళాప్రపూర్ణ : దేశోద్ధారక : విశ్వదాత

కలవయినావె? యే కలవు
గాంచని నీ రతనాల తెన్గు మం
దిరమున; నీవు మా తలఁపు
నీడల డాగి, త్వదీయ సద్యశః
కిరణ సువర్ణతోరణపు
కెంపుగ మారి తళుక్కుమన్న గో
చరుడవు, విశ్వదాత! విల
సద్గుణ నేత! శమించ దీ దిగుల్.

వేదాంత కవి.

# ముఖ్యపాత్రలు

ఈనాటకంలో దిగుతున్న పాత్రలస్వభావాలు చూచి కథలో చమత్కారం చూడండి.

## తిక్కన

బక్కచిక్కిన నిరుపేదవాడు. ఆంధ్రకవిసార్వభౌముడు, కథానాయకుడు.

## నాగేశ్వరావు

ఆంధ్ర మహావీరుడు, చల్లని మనస్సు గలవాడు.

## శనేశ్వరావు

ఆంధ్రత్వం నాశనంచేయటానికి దాపరించిన అవతారమూర్తులలో అగ్రగణ్యుడు, డాఫరుగాడు (అంటే అర్వవాళ్ళకి మన తెనుగు తల్లిని కట్టడానికి తెరిఫైడైనవాడు. కొంతకాలం అర్వదేశ ప్రధానామాత్యులకు సలహాదారైనవాడు.)

## బొర్రన్న

వీణ్ణి జాగ్రత్తగా చూడండి. కాఫీహోటళ్ళలో దిగి, కలెక్టరాఫీసులు, రైల్వేస్టేషన్లు, ఇంజనీరాఫీసులు చిరకాలం కవులుకు తీసుకొని, విపరీతమైన లాభాలుదీసి, తెనుగుగడ్డ గుల్ల జేసి, బొర్ర పెరిగిన రాండ్రోలు పొట్టగాడు, మహాధనికుడు సర్వ స్వతంత్రుడు.

## తాత

ధనికుడు. లుబ్ధుడు చాదస్తుడు సనాతనుడు నాగేశ్వరావు తండ్రి.

## పెంటు

ఇహ వీడో, ఓటికాలువాడు కుంటిచేతివాడు, పడుచువాడు, త్రాగుబోతు, పొగరుబోతు, తాతగారి సేవకుడు.

## కూలివాఁడు

కష్టజీవి, కరుణారస హృదయుఁడు, త్యాగశీలాలు చూపిస్తున్న కూర్మావతారుఁడు, తెనుగుతల్లి కష్టం చూచి సిరై తన పర్ణకుటీరానికి తీసికొనిపోయి కాపాడుకొంటున్న జాలిగల తండ్రి.

## దుర్గ

కూలివాఁడి భార్య కష్టాల కాపురమే బంగారు కాపురంగా చూచుకొంటున్న వుత్తమ యిల్లాలు.

## ఆంధ్రభారతి

ఈమెంగో మన తెనుఁగుతల్లి. తలిదండ్రులు కల్గినా తాతగారింట్లో పెరుగుతూ కష్టాలపాలైన కథానాయకురాలు, బక్కచిక్కిన తిక్కన్నని ప్రేమించిన ప్రియురాలు.

## లక్ష్మి

తాతగారి కోడలు. నాగేశ్వర్రావు భార్య ఆంధ్రభారతి పాలిట పెనుభూతకి.

ఇందులో కథానుంచి నాగేశ్వర్రావుకి శనేశ్వర్రావుకి పుటేదు. తిక్కన్నకి బార్రన్నకి బద్ధవైరం. తాతకి పెంకికి విపరీతమైన రొష్టు పోరు, ఆంధ్రభారతికి లక్ష్మికి మనస్పర్థ. అసూయ, ఇంకా కథలో వీళ్ళ చిత్రవిచిత్ర దృశ్యాలెన్నో కనబడ్తై పులకరింపజేస్తై.

వేదాంత కవి.

# తెనుఁగుతల్లి

## ప్రథమాంకము

1 వ రంగం : తోట

[ఉదయం 6-30 గం లకు తెనుఁగు పిల్లలు వీరగేయాలు పాడుకొంటూ ప్రవేశింతురు]

కీర్తన

కంటి రయ్యా ? ఆంధ్రాభువిపై వీరపతాకమ్ ||కం||
ఆంధ్రలక్ష్మి సంస్థాన్ అయ్యారులారా ! జియ్యారులార !
లాయరులారా !
అవనిమీద సుఖ మిడ లేదా ? పరీక్ష కాదా ? ||కం||
ఘనమైన, ధనమైన, సత్కీర్తియైనా గైకొన్న తెనుఁ
గుల కృపయేకృపయే కనుగొన ధాత్రిన్||
సుకుమార ! సుశరీర ! శుభసుందర ! జయ ఆంధ్ర !
లేవోయీ !
అదిగో కనవోయీ ! వినవోయీ !
మన జెండ ఏరీతి నుండెనో గుణధనులున్ ఘనబలులున్
తెనుగుల పసతో నిల్పిన జెండా ధరపై యీజెండా
స్థిరమై మీ కుండా కొదవలు లేవోయి పదవులు
పోవోయి ||కం||

తర్వాత వెంటవున్న తెనుఁగుపిల్లలకి నాగేశ్వర్రావు, శనేశ్వ ర్రావు యిరుపార్టీ నాయకులుగా (అంటే పెన్నాన్ఫుర్జీలుగా) నిలబడి, బలిగుడి ఆట (ఆంధ్రగేమ్) ప్రారంభింతురు.

శనే—ఒరేయ్ ! నాగేశ్వర్రావ్ ! కూతకు మేమే వచ్చేది.

నాగే—ఎవరొస్తే యేంరా ?

శనే—ఒరే! బ్రాన్నా ! కూ తిచ్చిరారా !

బ్రా—(దూకుడుగా కూతకు పోయి) భలీ బల్ చెడ్ గుడ్‌గుడ్ (అని కూ తిచ్చుచుండును)

తిక్క—(పట్టుకొనుటకు చూచుచుండును ?

నాగే—వద్దూ వద్దూ ! పోని తిక్కన్నా !

తిక్క—(పట్టుకొనబోయి అవు టగును)

శనే—(అవుటో అని బ్రాన్న నెత్తుకొని క్రిందపడును)

[అందఱు నవ్వుచూ చప్పట్లు కొట్టెదరు]

బ్రా—(ఆయాసపడుతూ చచ్చికూడా యెక్కిరింత లెందుకు ?

తిక్క—(నవ్వుచు) బ్రతికుండికూడా బోర్లపడ్డా రని.

శనే—పడకుండావుండరు గాన్లే ! కూతకు రండోయ్ !

నాగే—మళ్ళీ పాయింటు మీకే వస్తుందనా ?

తిక్క—పాయింటు రాకపోయినా జాయంటు పేమంటు లాతార్లేరా యీమాటు. (ఎగతాళిగా)

బ్రా—(ఉగ్రుడై) ఆఁ...కూతకు రా.

శక్క—(నవ్వుచు) భలీ బల్ చెడ్ గుడ్ (అని కూతిచ్చు చుండును)

బ్రా—(పట్టుకొనబోయి బోర్లపక్కలాబడి) చూస్తూవుంటా వేంరా! శనేశ్వరా ?

శనే—నేను కోపుకాసుకోండే నీవట్లా తొందరపడట మెందుకురా?

నాగే—టైమవుతున్నది కూతకు రండోయ్ !

శనే—వస్తున్నాం తొందర లెందుకోయ్

బ్రా—ఉండు...ఈమాటు వీళ్ళ తడాకా యేమిటో చూచొస్తా.

[కూతకుపాట]

చింతాక్ చిగురాక్ పన్నెండుకొమ్మల పైరాక్ చింతాక్ చిగురాక్.........

తిక్క—అదేం తెల్వోయ్ ? అదేం కూత ? ఇన్నిరకాలకూత ఎక్కడ నేర్చావ్ ?

బ్రా—నాయిష్టంవచ్చిన కూతల్లా కూస్తా. (అతిగర్వంగా)

నాగే—(తృణీకారంగా ఆకూత ఇక్కడ చెలామణికావ్.

శనే—(కుచ్చితంగా) అట్లాయెక్కడ వ్రాసుంది ?

తిక్క—(నిర్లక్ష్యంగా) ఎక్కడపడితే అక్కడే.

బ్రా—(అసూయతో) నీవాట్టే మాట్లాడావంటే నీతిక్క వదలిస్తా తిక్కన్నా.

తిక్క—నీ వనవసరంగా మాట్లాడితే నీబ్రా కరిగిస్తా బ్రాన్నా.

శనే—(ఉద్రేకంతో) ఏది కరిగించు కరిగించు (అని మీదకొచ్చును)

నాగే—శనేశ్వరా ! దూరంగావుండి మర్యాద కాపాడుకో !

బ్రా—ఉండకపోతే ?

తిక్క—ఇద్దటి భరతం పట్టామన్నమాటే !

శనే—ఏదీ పట్టూ ? (కలేబడ పోవును)

నాగే—ఏమిట్రా నీజబర్దస్తీ ? (కలేబడును.)

తిక్క—ఏమిట్రా నీ తెగనీల్గు ! బ్రాన్నా ? (మీదికి బోవును)

బ్రా—రా చెబుతా ! చెబుతారా ! ఏమిటో కలేబడును.)

(శనేశ్వర్రావు నాగేశ్వర్రావుని వదలించుకొని)

ఆ త్రిమూర్తులకైన నలవికాని ప్రతిజ్ఞఁ
బట్టి వేపెడి శనేశ్వరుఁడ నేను.

నాగే—ఆ శనిపని బట్టి ఆ పయోధి నడుమఁ
ద్రోసెడి నాగేశ్వరుండ నేను.

(బ్రాహ్మన్న తిక్కన్నని వదలించుకొని)

నీవంటి నిరుపేద జీవకోటి మొగాల
కాహార మిచ్చెడి బ్రాహ్మన్న నేను.

తిక్క—కష్టజీవుల కాయఘృష్టి హరించు బ్రా
హ్మన్నల వంచు తిక్కన్న నేను.

శనే—కట్టెపెట్టిక పడుపాట్లు కనఁ డెవండు.

(బ్రాహ్మన్నతో నిష్క్రమించును)

నాగే—దారిఁబట్టిక వచ్చిన దారిఁ జూచి
యీ శనేశ్వరుని బడాయి నెక్కడింక
సాగనీయను పదవోయి సంగడీడ.

(పిల్లలందఱు నాగేశ్వరాప్రు తిక్కన్నలతో నిష్క్రమింతురు)

తెరపడును.



2 వ రం గం

దే వుఁ డు గు డి

[పున్నాగపూలు మల్లెపూలు యేరుతూ కీర్తన
పాడుతూ భారతి ప్రవేశం]

కీ ర్త న

చాలే చాలేకోకిలా! అదేమి పాటే నీకో! మ ఱేమీచక్కని
దానవె నీవో? ॥చా॥

సురుచిర రూపే కఱ్ఱైపోయే పోరాదే!
పరిమళ మేమి తగులపోతే ఆ పూవూ యిఁక గ్గైకోరే!
అట్లాగే యిల నీవో ॥చా॥
నవయౌవనామృత తరంగిణీ! ఏపూలే? అవేవీ చూడనీ!
మధుపాళికి కినుక రాదటే?
రానీ, గానీ, కోకిలేమో? గరువము చాలా చూపించే ॥చా॥

[లక్ష్మి ప్రవేశం]

లక్ష్మి—భారతీ! నీకా పొగడపూ లెక్కడవే?

భార—తెనుఁగుతోటలోవి.

లక్ష్మి—నీ కెవరిచ్చారోగాని బాగున్న వే!

భార—నీ గులాబీ పూలకంటే బాగున్నవా?

లక్ష్మి—దేని బాగోగులు దానికే.

[తాత ప్రవేశం]

తాత—నిజమే తల్లీ!...ఏమిటి మీా యిద్దఱి తగదా?

లక్ష్మి—తగదా కాదండి. మీాకా పొగడపూ లెక్కడవని అడిగే సరికి తెనుఁగుతోటలోని వంటూ, నీగులాబీపూలకంటె బాగున్నవా అని బడాయి పోతున్నది...మాలావు బడాయిగాని

తాత—ఇంతేగదా.

భార—కాదే తాతా! ఇందులో నాబడాయి యేం కనబడుతున్నదే? ఎందుకీ వుక్కురోషం? పైగా, నీకెవరిచ్చారని అడుగుతుం దేమిటి? ఎవ రిస్తారు? తన కెవరన్నా తెచ్చివ్వటం రివాజైందేమొ.

లక్ష్మి—గుమ్మడకాయలదొంగ ఎవరంటే భుజాలుతడుముకొన్నట్లుగా వుంది. నీకథ చూస్తే తాత చెప్పాలి?...నీతీరే చెబుతున్నది.

తాత—మాలతగాదా పోయి పోయి మాలతగాదా లేవదీస్తున్న గాని, నాకేం బాగుండలా, మీాతగాదా...పోండి.

(నిష్క్రమించును

లక్ష్మి—నీగరువము నీ కులుకు
నీ వగలాడి తనమ్ము నీ మనో
రాగకళా ప్రఫుల్ల సుమ
రాజ పరాగ పరీమళమ్ము బా
గోగులు తప్పెఁగాని, యిది
గో! యిఁక నాకడ సాగవేమి నీ
బోగపుదాని యాటలు, ప్ర
భుత్వము లక్ష్మిది ఆంధ్రభారతీ!
అనవసరంగా మాటలంటే పడేదాన్ని గాను.

(తీవ్రదృక్కులతో నిష్క్రమించును)

భార—(దీనవదనయై) కలవాళ్ళు అనవసరంగా మాట్లాడి కొట్లాట కొచ్చినా న్యాయశాస్త్రం వప్పుకొంటుంది. లేనివాళ్ళు యెంత ధర్మాన్ని బట్టుకొని వ్రేలాడుతున్నప్పటికి నిందలు మోసి కష్టించవలసి వస్తున్నది. ఉన్నవాళ్ళే సౌందర్యం, సౌభాగ్యం అనుభవించుటానికి అర్హులు. లేనివాళ్ళ మొగాన ఆసౌందర్యం సౌభాగ్యం, కనపడ్డయ్యా, యింకా వున్నవాళ్ళకి నిద్రపట్టదు. ఈ లక్ష్మి కలవాళ్ళ కాపురంలో తిరుగుతోన్నది గనుక, యింత మిడిసిపడి పోతున్నది. జగద్రక్షకా! ఈభారతిని పుట్టించి నప్పటినుంచి యింత దిక్కులేని దానినిగా జేసి వేధించుచుంటి వేమయ్యా? నీకేమి అపరాధం చేసినది; మాతాపితరులు కఱవైన యీా భారతిని వీధికిలాగి...జగన్నియంతా!

నీ నగిషీ గల నిల్వు టద్దపు మేను
పెనుటాలపైఁ బడవేయు టేల ?
నీ కమ్మని చరిత్ర గైకొన్న బొజ్జను
మంటలో మలమల మాడ్చు టేల ?
నీ రత్నముల పేరు లేరెడి వాక్కును
దాహమ్ముచే మాపఁ దలఁచు టేల ?
నీ ప్రసన్నకళను నిలపెట్టు దృక్కుల
స్థితి, దిక్కు లేకుండఁ జేయు టేల !
నీ యనుగ్రహ భాగ్య నిర్నిద్ర భద్ర
పదసరోరుహ చ్ఛాయకై వడలి నలిగి
యున్న భారతి కింక యీ వన్నె లేల ?
మొగసిపడు లక్ష్మి చేత దూషించ నేల ?

[తిక్కన్న ప్రవేశం]

ిక్క—పున్నాగపూలకోసమా చూడటం ?
ార—(సిగ్గుతో మాట్లాడకుండా పోఁబోవును)
ిక్క—నేను నీకు సహపాఠిని, చెలికానిని, సిగ్గెందుకు ?
ార—(పెడమొగం పెట్టి) ఎవరు పిలిచారు ?
ిక్క—పిలుచుట దేనికే ప్రణయ
వీణ ? నిజమ్ముగ నిన్ను జూచి ని
ష్కలుషుఁడు సైతమున్ శ్రుతులు
గల్పుకొనంగ మహాప్రయత్నముల్
సలుపుట లేదె ?? దీనిని వి
చారణసేయుట లింక దేనికే ?
కలపున మెల్లగాఁ గదలఁ
దల్చిన రాగము నందుకోఁగదే !

భార—పేదవాళ్ళ నింత చులకనగా చూడటం ధర్మంకాదు.
తిక్క—విలువైన వలపును వదలిపెట్టడం న్యాయంకాదు.
భార—వ్రతం చెఱపటం కూడా ధర్మమేనా ?
తిక్క—మన కిప్పుడే ధర్మం అడ్డుచెప్పదు

మోళ్ళు పల్లవించెడి మాడ్కి పొంగి పొరలు
మోహగానామృత రసప్రవాహమునకు
పాపపంకిల మంటునే పంకజాక్షి !
ప్రేమకన్న పుణ్యం బింక వేఱె కలదె ?

భార—నేనాసర్వేశ్వరుడికొక్కడికే నాతనువును సమర్పింపఁదలచా.
తిక్క—పతితపావనుఁడైన చతురునకును

ప్రేమ కుసుమాంజలియె బహుప్రీతియుంట
యీ విసిర్మలానందరఘురీవనాన
పూచు పూలచే నోములు నోచుకొనవె !
[అని ముద్దుపెట్టుకొనపోగా భారతి కీర్తన పాడును]
తగునా ? ఇ...గునా ? సుగుణా !

మహాసాహస కార్యం బౌర !

ప్రేమసామ్రాజ్య రమానాథా !

ఏమిటీ ఘోరవధా॥

ప్రసూన రేఖాకౌముదీ ! నన్;

వేప కిట్లా వేపకే॥

ప్రేమవాహినిని పడవను నడుపో

ప్రేమసయుఁడవై సాగరా !

(లక్ష్మి వచ్చుటచూచి భారతి తటాలున నిష్క్రమించును)
తిక్క—(నివ్వెరపడి చూచుచుండును)

లక్ష్మి—

ఇది యేటి? నీకు పవిత్రలక్షణ కళా
హేలామహోల్లాస సం
పద; బాగున్నది, మెచ్చుకోదగిన శు
భ్రజ్యోత్స్నతోఁ బోలు చు
న్నది, యీమాత్రపు గొప్పదాన వని యె
న్నం డిట్టి నేత్రాలతో
నిది యీక్షింపకపోతి, భారతి! ధనం
బెంతెంత గైకొంటివో?

(నిష్క్రమించును)

తిక్క—

ఎక్కడిదానవే! యెవతె
వే? పెనుభూతకి! ఓర్వలేని ని
దృక్కుల కాలిపోను; నలు
దిక్కుల నిన్నిఁక నిల్వనీను, నీ
నిక్కువమౌ కనుంగొనని
దే కనుమూయగ నీను, నీవు నా
చక్కని ఆంధ్రభారతిని
చల్లని చూపులఁ జూచు టొప్పదే?

(నిష్క్రమించును తెరపడును)

3 వ రం గం

బొబ్రన్న యిల్లు

[బొబ్రన్న, శనేశ్వర్రావు సోఫాలపై కూర్చొని]

శనే—తిక్కన్న తిక్కవదలిస్తేగాని నాగేశ్వర్రావు లొంగడ్రా.

బ్రాహ్మ—ఆఁ! తిక్కన్న దేమిటిగాని నాగేశ్వర్రావు భరతమేపట్టాలి తిక్కన్న ఓ లెక్కలోవాడా? జమలోవాడా?

శనే—అట్లా అనకు. పన్నాగాలు పన్ని మనమీద విజృంభించి పడటానికి సిద్ధమౌతున్నవాడు వాఁడే!

[తాత ప్రవేశం]

తాత—మా నాగేశ్వర్రావ్ వచ్చాడ్రా అబ్బాయ్!

బ్రాహ్మ—(లేచి) లేదండీ తాతగారు!

శనే—(లేచి) ఎందుకండి?

తాత—ఎందుకా?...ఆ మదమేమిటో చూడటానికి. (పోబోవును)

బ్రాహ్మ—ఏమిటో కనుక్కుందాం పిల్వరా!

శనే—తాతగారు!

తాత—(వెనక్కి తిరిగి) వచ్చాడా?...తిక్కన్న యెక్కడ వచ్చాడో!

బ్రాహ్మ—ఏమిటండి తాతగారు! నాగేశ్వర్రావ్ వస్తున్నాడు లెండి!

తాత—ఏడి?

శనే—వస్తాడు లెండి. తిక్కన్నెందుకండి?

తాత—ఎందుకా?...అరదండాలు వేయించి ఖైదుకు పంపటానికి.

శనే—అదేమి వుపద్రవ మండోయ్?

తాత—ఆ తిక్కన్నతో మావాఁడు చేస్తున్న స్నేహమే వుపద్రవం తెచ్చిపెట్టింది.

బ్రాహ్మ—అనుకున్నంతా అయిందీ?

శనే—కాదు మతీ!

తాత—తల్లిదండ్రుల్లేని పిల్లకదాని పెంచుతుంటే—

శనే—ఎవర్ని?

బ్రాహ్మ—భారతిని రా!

తాత—తీవతీసుకు పోవటానికి చూచాడుట తిక్కన్న—

శనే—ఎప్పుడూ ?

తాత—ఈసాయంకాలమే. అఘోరించకలి మాకోడలికళ్ళపడిందట...
పైగా అతిక్కన్నగాడు మాపిల్లని కూయరాని కూతలు కూసిపోతా డట !

శనే—అరే! యింకా రాడేమిటోయ్ ? నాగేశ్వర్రావ్. మేం త్వరగా పిల్చుకొస్తాం పదండీ తాతగారు.

తాత—ఆలస్యం చేయకండి అబ్బాయిల్లారా! అతిక్కన్నగాడికియీ వరసన వూరిమీదపడకుండా తొందరలో తగినప్రాయశ్చిత్తం చేస్తేనేగాని మన పరువుండదు పోతా ! పిల్చుకొస్తారుగదూ ?

శనే—ఇంకా పిల్చుకురాకుండానా తాతగారు ?

తాత—త్వరగా రావాలి నాయనా !

(నిష్క్రమించును)

శనేశ్వర్రావు, బ్రాన్న—చిత్తం. (సాగనంపి వత్తురు)

శనే—చూచావా ? నేనన్న ప్రకారం ఎంతపన్నాగం పన్నాడో ?

బ్రా—నిజమే......యిట్లా యెంతకాలం నించో కానరానిదొంగ.

శనే—బహుబుద్ధిమంతుడి మాదరి నాగేశ్వర్రా వింట్లో జొరబడ్డప్పటి నుంచి, ఇదిగో బ్రాన్నా ! వీడి పన్నాగా లన్నిటికి విఱుగు డీదినరకే కనిపెట్టా. అవిఱుగు డిప్పుడు పనికొచ్చే ఘడియలు కుండ వచ్చినై......అదికాదురా; ఆ కుసుమకోమలగాత్రి, భారతి యీ నిర్భాగ్యుణ్ణెట్లా సమ్మతిస్తుంది ? (నవ్వి) వీడి ఆకారాన్ని చూచి వలలో పడటానికి, (నవ్వి) బాహీనా వరాంగుటంగు. ఈమెమొ జగన్మోహనాంగి, వీళ్ళిద్దరికి హస్తి మశకాంతరం తేడా...అది వీణ్ణి వరించటం కల్ల.

బ్రా—అదిమట్టుకు నిజమేరా శనేశ్వరా !

శనే—బ్రాన్నా! నిజంగా ఆపిల్ల నీవంటి వాళ్ళకోసం పుట్టిందిరా నమ్ము నమ్మకపో! దాని సహజసౌందర్య ధనాన్ని భద్రంగా కాపాడటానికి నీవే అర్హుడవ్. అసలేమంటావ్? నీకిష్టమేనా?

ఏ కోశంబునగాని దీని కెవడే
    యేత్రోవ కష్టంబుగా
కీడొన్న ట్లింక విన్నచో పిడుగు మా
    ర్కొన్ దూకి శోధించి యీ
లోక ధ్వంస శనేశ్వరుండ వసి గ
    ల్లోలంబుఁ బుట్టించడే?
నీకార్యమే లొనరించుదాఁక సఖుఁడా
    నిద్రించఁడే మిత్రుఁడున్!

బ్రా—ఎవరో గాదు. నాగేశ్వర్రావే దీని కిప్పుడు ఎదిరించేది.

శనే—వాణ్ణికూడా కట్టేస్తా. లక్ష్మికి తిక్కన్న వృత్తాంతం వ్రాసినట్లు వృత్తాంత మొకటి పుట్టించి తిక్కన్నంటే గర్భశత్రు వనిపించేటట్లు చేస్తేసరి. నాగేశ్వర్రా వింకా వాండ్లి జోక్యమే పట్టించుకోడు.

బ్రా—ఇది బలే వుపాయం. ఈకార్యసాధనానికి వజ్రాయుధం వంటిది. ఇదిగో! నీకార్య పలిసిందానికి మొగమాటమేమాత్రం పడక సుమా!

శనే—దానికేంలే! దానికెప్పుడు నీ నభ్యంతరం చెప్పావు. వల్లకాదన్నావు? ఇదిగోరా! నిజంగా నీ సొగసుకి భారతి ముచ్చటైన కాపురం చేస్తుందిరా (చూచి) నాగేశ్వర్రావింటికి పోతున్నాడల్లేవుంది. మన ప్రయత్నంలో మన ముందాం పద.

(నిష్క్రమించును తెరపడును)

## 4వ రంగం

### నాగేశ్వరరావు గృహం

### భారతి ఖిన్నురాలై యుండును

నిందపడి శోకయింట్లో వొంటరిగా భారతి విలపిస్తున్నప్పుడు పాడుతున్న—

కీర్తన

పేద మోమే చూడలేవా! భూమిపై
మృదు స్వభావా! కన్నతండ్రి! కావవా?
నింద వేసీ నిల్వ నీవా? ఎందు కీ దిక్కు లేని జాతీ?
సుజనరక్షా! దుష్టశిక్షా! ప్రాణమే
తీయరాదా? ఆంధ్రజాతిం బ్రోవగా ॥ పేద॥

భార—తల్లిదండ్రులులేని బిడ్డయైన ఇంతమందంత దుర్భరవిపత్పర్వతాన్ని పిలిచి పడవేయటం దేనికిదగ్గ దయకా? తల్లిద ప్రంబు కరవైన బిడ్డ జోలుగు బొందుకుంటె కనుతేలిక్కైనదని యెఱుగవా? పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం వేయుటమే ధనుర్విద్యా కౌశలమనుకొంటివా? ప్రేమమయుడవైన నీకింత క్రోధమెక్కడిది? నన్ను నీవు పుట్టించి పోషించటం దేనికే చెప్పనైతివే? చెప్పుటకేమి అవసరం లేనిచో నన్నిట్లా హింసించటం యేలనయ్యా? ఓ దీనజనమందారా! దిక్కు మొక్కు లేని నాదీనముఖంలోని ప్రతిబింబ మేమైనా ప్రకాశించుననియా?... నా ప్రాణాలు పోకుండా చూస్తున్నావు? నాకష్టం యెవరికి చెప్పి తీర్చుకొందును? తుదకు నీవుకూడా యీ భారతిపై కన్నెఱ్ఱ జేసిన... నా మొఱ నాలకించువా రెవరు?

జనక ! విశ్వాని పంచికా స్వర్గము నుంచి
నీ మృదుమధుర దివ్య గానామృతంబు
చిలికి; ప్రకృతి కాంతకు జీవకళ నొసంగు
భారతిని పస్తుంబెట్టుట భావ్య మగునె ?

[తాత ప్రవేశం]

తాత—నీ సంగీతం కట్టిపెట్టు పిల్లా! రాగారాగా యీరాగాలే మా పరువు కాస్త మట్టిపాలు చేస్తున్నాయ్ చాలుగాని కట్టిపెట్టు.

భార—తాతా !

తాత—తాతా లేదు రోతాలేదు...చాల్లే నీ వగలాడితనం.

భార—నే నేమెఱుగను తాతా !

తాత—ఏమీ...యెఱుంగ నక్కర్లేదు...ఆట్టే మొరక్క.

భార—బిడ్డమాదిరి పెంచుతున్న మీకే పనికిరాకపోతే ఈ భారతికి దిక్కెవరు తాతా ?

తాత—దిక్కా...కంటికికనపడ్డవాడల్లా దిక్కే. నీకుదిక్కు లేక పోవటమే...బైటికి పద.

భార—(భయంతో) బైటి కెందుకు ?

తాత—పిలుస్తున్నవాళ్ళతో లేచిపోవటానికి.

భార—(చెవులు మూసుకొని తగని పని.)

తాత—అల్లాగా...తగిన పనేలే నీకు.

భార—(కాళ్ళమీద పడును) తండ్రీ !

తాత—(విదలించుకొని) సరేలెద్దూ, బైటికి పద.

భార—(దీన వదనయై)

ఎంత కృపాకటాక్షమున
హేమలతా లలితాంగిం జేసి ది

గ్గంతులబిగాదఁ ద్రిప్పి బుధ
కాండము చే గొనినఁగూడఁ జేసి నీ
శ్చితగనుండు గ్రొంబసిఁడి
సీమల నిల్పిన ఆంధ్రనాయకా!
పంతముతోడ నీ విపుడు
బైటికి గెంటెద వాంధ్ర భారతిన్.

(కాళ్ళమీద పడును)

తాత—(పదలించి) కాళ్ళా వేళ్ళాపడితే పోయినపరువుమళ్ళారాదు.

[నాగేశ్వర్రావు ప్రవేశం]

నాగే—ఏమిటే నాన్నా!

తాత—(అబ్బురంగా) వచ్చావురా నాయనా?

నాగే—ఏముటి?

తాత—ఏమిటా!...దీన్నింకా యింట్లో వుంచకూడదు.

నాగే—పాపం...ఆ పిల్లమీా దెందుకే కోపం?

తాత—పిల్లేమిట్రా?...పిల్లకాస్తా పెద్ద వ్యవహారాల్లోదిగితేనూ.

నాగే—దానికి వ్యవహారా లంటేనే తెలియవు నాన్నా!

తాత—(మొహం చిట్లించుగొని) తెలియవులే.....వ్యవహారాలు నీకూ తెలియవులే. ఓరి సిదుంప తెగ.....వ్యవహారాలు నీకూ తెలియవులే. ఇద్దఱూ కూడబలుక్కునే దిగారన్న మాట. గొప్పగొప్పవాళ్ళ కాపురం గోడగడ్డలు చేసినదాన్ని దాన్ని లేవదీసుకొని పోవటానికి కూర్చున్నవాణ్ణి వెంటఁబెట్టుకొని హాయిగా కులుకుతూ కూర్చో. నే నీ కొంపలో వుండలేను...ఉంటే యీఘోరం కళ్ళారా చూడలేను...చూచి చేతగాని తెంపిలాగా కూర్చోలేను. నాకెందుకీ రంకురామా

యణాల్తో రోష్టు...ఎందుకు...నాదారి నేను చూచుకుంటే మంచిది. ఇక్కడ యీఅల్క దాన్ని పెట్టుకొని ఒక్క నిముష మన్నా వుండలేను. అదికాదు. ఏనాఁడన్నా మన వాకిట్లో గుంపు పోగైందా? గుంపు పోగైందా అంట? ఇదెప్పుడు నాజూకు సంగీతాలు తీయసాగిందో...అదిగో అప్పటినుంచే పోగైంది.....ముద్రష్టపు మూక. పైగా ఆ తిక్కన్నగా డాక్టఁడు. దేబిరిగొట్టు మొహం బెట్టుకొని చుట్టూతా తిరిగి స్నేహితుఁడికొంప చెట్టుబొగ్గులు చేయటానికి తయారైనాడు. వాణ్ణి వెంట వేసుకొని తిరిగే టప్పుడే చెప్పా...విన్నారా అప్పుడు? ఏమోలే తల్లిలేని పిల్లవాఁడవని చెప్పి (కన్నీళ్ళు తుడుచుకొని) అల్లారుముద్దుగా చూచుకొంటుంటే యీవర సన యిల్లు సానికొంప చేయటం మొదలెట్టావా? ఈ భారతి మూలానగాదూ వూరూరా, తలెత్తుకొని తిరిగే యోగ్యత లేకుండాపోవటం? ఈ నిముషం లగాయితు ఓ రబ్బీ! చెబు తున్నా విను. ఇద నా కొంపలో వుండకూడదు...వున్నదా నీకూ నాకూ తండ్రీకొడుకుల సంబంధమే వుండదు.

[లక్ష్మి ప్రవేశం]

లక్ష్మి—మామగారు!

తాత—ఏం అమ్మా?

లక్ష్మి—మా వాళ్ళింటికి తీసుకుపోండి.

తాత—మా అమ్మా! ఈ మాయదారిది సిన్నేమన్నా అన్నదా యేమిటే!

లక్ష్మి—చేసుకొన్నవాళ్ళు మూగవాళ్లైతే అనరూ? అందఱూ అంటారు...ఎందుకులెండి...(కన్నీళ్ళు తుడుచుకొని) యీ

కొంపలో యేనాఁడూ రొష్టుపడకుండా అన్నినీళ్ళు ముట్టలేదు సరికదా. ఒకనాఁడైనా, కంటికినిద్రనెఋగను. ఎందుగ్గానీండి మీ అబ్బాయి కా భారతికంటే ప్రాణం. ప్రపంచంలో మఱొకటి లేదు.

మీరేమో కలవారి కాపురములో
మేలైన సత్కీర్తి కాం
తా రాజేంద్రు లటంచు దుర్భ్రమను పా
త్రన్ వంశమర్యాద మా
పా రెవ్వారును గాంచ కిమ్మొయి మహా
పాథోధిలోఁ ద్రోసినా
రే! రాకన్నుల వ్రాత యిట్లు కనినా
రే! నాంమ! భూమీస్థలిన్.

(మావాళ్ళింటికి తీసుకుపోండి)

తాత—చూరా! పంచమహాపాతకుఁడా! ఆ చెంపన లక్ష్మిదేవి కొత్తగా కాపరానికి రావట మేమిటి? ఈ మాయదారి దానితో గొట్టేమిటి? నా కోడలికి యీ ముద్రష్టపుదాని మూలాన యెంత భయంపుట్టి పుట్టింటికి పోతానంటున్నదో చూస్తా, నీకే చెప్పేది వింటున్నావా? ఓరి పరమదౌర్భాగ్యుఁడా! ఎట్లా నీతో, నిన్నే రా? ముందా భారతిని అవతలికి గొట్టి తలుపులు ఘడియలు వేసి గా, పో రా. పోవేం. కాడి మానువలే నిలబడి చూస్తా వేమిట్రా?

[పింటు ప్రవేశం]

పింటు—అయ్యా! తాతాఘూర్కి జాబూ వచ్చింది. (హడావుడి పడుతూ వచ్చును)

తాత—ఏమిట్రా హడావుడి. ఒకటే పాడైన హడావుడి.

పెంటు—మీకీ జాబూ అండీ.

తాత—ఏం జాబు! నా కొంపమీద అర్ధరాత్రివేళ జాబులుకూడా యేమిటి ఖర్మ? ఏది! తగిలేవ్. ఎత్తిపడై.

పెంటు—(ఇస్తూ) దీన్కి పైనా ఖవర్ వుందిగాసాబ్, (ఇచ్చును)

తాత—ఏడ్చినట్లేవుంది లేవోయ్ తెల్వీ—పో.

(పెంటు నిష్క్రమించును)

తాత—(కవరు తలక్రిందులుగా త్రిప్పి దీపం పెద్దదిచేస్తూ) ఇవి ఇంగ్లీషక్షరాలు కాంబోలు గొడవ. (కవరు మూతిచించి) లోపల మళ్లా అచ్చతెనుగేవుంది. (చదువును)

ప్రియమైన నా ప్రణయ సామ్రాజ్యలక్ష్మికి ముద్దులు. నీవు వ్రాసిన వుత్తరంచూచి ఆనందభరితుఁడ నయ్యాను. నీహృదయసరోవరంలో యీ మదనమోహన రాజహంసను (నాగేశ్వర్రావు వంక భారతివంక మిట్టిమిట్టి చూపులతో నిట్టూర్పులు విడుస్తూ) విహరింపఁ జేసినందులకు నా సర్వస్వము ధారాగతము సేయనిశ్చయించుకొన్నాను.

ఇట్లు,

నీ ప్రియమైన తిక్కన్న.

[ఆ వుత్తరం చింపి నలిపి నలిపి భారతి మొగాన గొట్టి విపరీతమైన కోపావేశంతో]

లేచిపో...సిగ్గులేని ముద్రష్టపుదాన. ఛూ, నీ మొహంమండ. అబద్ధా లాడితే పాపం బ్రద్దలవ్వకుండా వుంటుందా? చూత్రా! సిగ్గులేనివాఁడా! వ్యవహారాలే యెఱగ నంటివే? ఈ వ్యవహారాలేమిటి? గోడప్రక్కనే కాచుకొన్నాడు పోవే తిక్కన్న......నూపాలబడి యెందుకేడుస్తావ్ యెదురేడ్పు?

నాగే—(ఉత్తరం చూచి ఆదుర్దాగా) నాన్నా! భారతికి వ్రాసింది కాదే......లక్ష్మికి వ్రాసింది.

తాత—(పళ్లు కొరుకుతూ మొహం చిట్లించి) ఓరి పిచ్చిమొద్దు, పిచ్చిమొద్దుకాన! (దగ్గఱకొచ్చి నోరుమూసి) నీకు తెలియదు వూరుకోరా! (కోపంతో) ఓసి నీ మచ్చమాయ నాకొడుకు కాపురం నిలుపునా—తీద్దామని చూచావుగా? పోవేం.....

పోతావా పోవా...మాదిగాడిచేత యీడ్పించాలా? ఊఁ,

నాగే—తొందరపడక నాన్నా!

తాత—ఓరి నీదుంపతెగ, కొఱవితో తలగోక్కుంటావుట్రా? నీశాంతం మండిపోను.

నాగే—శాంతమే మనకు భూషణం నాన్నా!

తాత—వచ్చినట్లేవుంది. నీ తెల్వి, నీవూవల్లకాడైపోతే...పోఅవతలికి

నాగే—(వేడుకొంటూ) నాన్నా! నాన్నా!

ఏ విశాలగభీర భావాంబర తలాన

ఏతల్లి యమృత జీమూత యయ్యొ

ఏ రాజ సుకుమార పారిజాత వనాన

ఏ జనని వరాల జాజి యయ్యొ

ఏ సువర్ణమణి సింహాసన సీమలో

ఏ మాత సుమనోభిరామ యయ్యొ?

ఏ వీర కేసరి జీవితాటవి మధ్య

ఏ దేవి పచ్చి బాలింత యయ్యొ

అట్టి......

తాత—అట్టి కాదు నేలమట్టో,

నాగే—అట్టి సులలిత సుగుణ సుధాంజలి యగు

ఆంధ్రభారతి నిట్లు నిరాదరించి

వెడల గొట్టినచో తెన్గు పుడమి కింక
తెగులు పుట్టకయుండునే తెనుగుతండ్రి !

(కాళ్ళమీద పడును)

తాత—(పడద్రోసి) అఘోరించినట్లుందిలే, నీనీతి నీవు...వృద్ధురిద్దరు గాని దేశాన్ని......కదలవేసే పిల్లా? నీకా్కదూ చెప్పేది ? ఒక్కనిముషంగూడ నాగడపలో నిల్వటానికిపీల్లేదు. పదవేం.

భార—ఈనడి రాత్రివేళ యెక్కడికి పొమ్మంటారు ?

తాత—(హేళనగా) ఎక్కడికా ! చక్కగా కమ్మని సుఖం అనుభవించే చోటికి పద (గెంటపోగా)

నాగే—(రెండుచేతులు పట్టుకొని) నాన్నా ! నాన్నా !

తాత—(విదళించుకొని) నాన్నా లేదు. గీన్నా లేదు. పో, అవతలికి పోవేమే ? (గెంటపోవును)

నాగే—(పట్టుకొని) నాన్నా ?

తాత—విదళించి ఏం......వళ్ళు వాచి కొట్టుకొంటున్నావా ? పళ్ళూడకొట్టేను. పో, అవతలికి...పొమ్మన్నది నిన్ను కాదటే? (పడద్రోయును. భారతి కీర్తన పాడును)

కీర్తన

తండ్రీ ! ఇదియే ధర్మము ?
కొండ విఱచి పైఁబడద్రోతువా ?
నాబ్రతుకు భారమా ?
తండ్రీ॥

తాత—పో, ముద్రష్టపు చచ్చినదాన (బైటికిగెంటి) ఇంకానాయింటి పట్టు కనపడ్డావంటే మట్టుకు మహామ్మాయిచేశానే !

(తలుపులు విసరుతో వేసి, గడియలువేసి, వెనుక దీనమొగంతో నిల్చున్న నాగేశ్వర్రావు మొహం కొట్టుకొని) అబ్బా! నీదుంప తెగా. (తలెత్తి) ఏమిట్రా ఆయేడ్పుగొట్టు మొహం? పదవేం యింట్లోకి. ఎవరైనా నవ్విపోతారన్న సిగ్గుండొద్దు మొహానికి పుట్టావు పాడైనపుట్టుక. ఈతడవ ఆతిక్కన్నగాణ్ణే గుమ్మంతొక్కనీ చెబుతా. (అపారమైన దయతో) రా! లక్ష్మి! మాఅమ్మా! ఈ దౌర్భాగ్యుడితో నీకెన్ని కష్టాలు వచ్చిపడ్డవే పరాయిపిల్ల వనైనా దయాదాక్షిణ్యం వుండొద్దు? ఎందుకేళ్లొస్తేనేసరా? పుట్టాడు పాడైనపుట్టుక ఇహం ఆభార్యచచ్చింది వదిలిందిగా. రా! అమ్మా! లక్ష్మి! లక్ష్మి—ఇంకా తెల్లవారిందాకా అట్లాగే చూస్తుండాలా? రండి!

(తాత లక్ష్మి నిష్క్రమింతురు)

నాగే—(పొంగి పొరలి వస్తున్న దుఃఖంతో)

ఇగురుమామిడి చిన్ని చిగురుకొమ్మలలోన
పట్టుజాకట్టు చూపెట్టుతినయ!
పూలకొమ్మలలో పొంగిపొరలు కమ్మదనాన
జలకేళి సల్పు రోజాకుమారి!
కోకిలమ్మల సన్నగొంతుతో హాయిచే
సోయగ మొలికించు తోయజాక్షి!
అల్లారుముద్దుగా ఆనందలక్ష్మితో
రాజసమ్మొడెడి గారాలకూచి
అఖిల విద్వత్సభాంభోధి సుఖసుధాక
ధాతరంగ రంగత్ప్రబంధ కమనీయ
డోలికా లోలమై, బ్రాహ్మి జోల వినెడి
నా తెనుఁగుతల్లి పులుల కంటఁబడె నకట!

ఎంత వున్నవాళ్ళ కాపురంలో పుట్టినప్పటికి యీ చేతగాని మూగతనం యెందు కొచ్చింది? స్వతంత్రం లేకపోవటం వల్లనే వచ్చింది. దేనికైనా స్వతంత్రమే మహాబలం. అటువంటి స్వతంత్ర బలసంపన్నుడుగాని వాడు బ్రతికున్నప్పటికి చచ్చినవాళ్ళతో జమ కట్టుకోవలసిందే.

అమృత నీహార బిందుగర్భమున బుట్టి
అతులిత నవరత్నాభరణాంగి వైన
ఆంధ్రభారతి! యీ దుర్మదాంధు నింట
పరిభవాగ్నిలో బడి కరగితమ్మ.

స్వతంత్ర ధనం ఆర్జించే వఱకు యీ కొంపలో కాలుపెట్టను. పెట్టకూడదు.

(నిష్క్రమించును)

తెర పడును.



# తెనుఁగుతల్లి



## ద్వితీయాంకము



### 1 వ రంగం, నదీతీరం

[ప్రచండ శపథం తీర్చుకొనేవఱకు అన్నపానీయాలు పట్టనని తిక్కెక్కిన తిక్క వేషంతో తిక్కన్న ప్రవేశం]

తిక్కన్న——మాయ వేషధారులకు, అఖండ దురాశాపీడితులకు కపట నాటకసూత్రధారులకు, అసహన వీక్షణాలంకార సహస్రాక్షులకు, ఆయుర్భాగ్యములు, అష్టైశ్వర్యములు, ఉగ్గుపాలతో నిచ్చి కడుపార ప్రేమతో పెంచుకొనుచున్న లక్ష్మీ! నీవు లోకమాతవా? ఈ బిరుదు నీ కెవ డిచ్చినది? కాదు కాదు. నీవు లోకమాతవు కావు, లోకఘాతకివి. ఇంకనుంచి నీవీ బిరుదు తగిలించుకొని సంచరించు నీకెన్ని ఆరాధనలు, నివేదనలు, ముట్టగలవో తెలుసుకొందువు. అట్లాచూచెద వేమిటే? న్యాయమార్గ విధ్వంసకీ! నే నెవణ్ణో తెలుసునా? నీమహా మారణగుణాలవల్ల తిక్కెక్కిన తిక్కన్నను, లోకానికెల్లా నీవు లోకఘాతకివని తెలిసే పర్యంతమూ నాకీ తిక్క తగ్గదు. లోకఘాతకీ! లక్ష్మీ! నిన్నారాధించు నీ రాకుమారుళ్లు, కుబేర్లు నా కాలిగోటికి సాటిరారు. నాముందు నిలువలేరు. వాళ్ళని

తీసుకొని నాపైకి దండెత్తివచ్చాలక్ష్మీ? పొరపాటుసుమా! ఆ ఓబయ్యలంతా నిన్ను దీసుకొని నాపై దండెత్తటానికి చూస్తున్న మొగాలే లక్ష్మీ! నిన్నుచూచి గడగడ లాడు వాళ్ళపై నీపెత్తనం సాగినట్లు నాముందు నీయాటలుసాగు నని యనుకొంటివా?

లేనికొంపపయి గాలి మసూరముగ దూకి
కూటికుండ పగులఁగొట్టు ఘనుఁడు
మున్నన్నా కాపురమ్ములు గుండములవేసి
దిబ్బలు వెట్టి కందిన బలుండు
వారసత్వములకై పన్నాగములు పన్ని
మిన్నాగు మాడ్కి- కూర్చుర్న ఖలుఁడు
తనకన్య కూడఁబెట్టినవాని కనుగొన్న
శిరమువంచి సలాము సేఁయు చనట
నాకు దాసానుదాసులై లేకితనము
తోడ, నీకాళ్ళు కళ్ళకద్దుకొని వేడు
కొని గడగడ లాడెదరుగాని నిరతంబు
నీకు మగలైన యేరీతి నిల్తు లక్ష్మి!

నీ మురహంకారం నీకు మగఁడైనవాఁడే తీర్చేది. అతఁడే నన్నునూ, నా ఆంధ్రభారతిని పూజించేది. లక్ష్మీ! నీవు నా వాణి కన్న లావణ్యాం గనదాన వనియా...విఱ్ఱవీగుచున్నావు? నాభారతి కున్న నీతి నియమం నీ కున్నచో లక్ష్మీ! నేఁడీ ప్రపంచమంతయు యుద్ధభూమిగా వుండేది కాదుగదే! ఒళ్ళును పుల్కరింపజేసే తెల్ల బెళ్ళులలో నుండి వచ్చు.

చక్కదనమ్ముచేఁ బర వ
శత్వములోఁ బడవేసి, రేఁబవల్
పెక్కు విధాల వేపుకొని
బిక్కమొగమ్ముఁ దయారుఁజేసి నల్
దిక్కుల కంపి దుర్దశకు
దింపెడిసానికి నీకు, భేద మే
ప్రక్కను లేదు లక్ష్మి! కన
రా? మఱి మీ నటనా విశేషముల్.

[పెంటు ప్రవేశం]

పెంటు—హేంబ్రో! బాబూ! సాలా గలాటాలో వుంఛార్మికే!

తిక్క—పాపిష్టిలక్ష్మివల్ల గలాటాలో నేవున్నా. విశేషాలేమిటి పెంటూ!

పెంటు—ఇశేషాల్కి హేమండీ! బహుత్ అచ్ఛాగా వుంఛాలం లుచ్ఛాగా మారిందిగా, మీకి హింకా ఖ్యాల్ లేదండీ పండిత్ సాబ్?

తిక్క—(ఆదుర్దాగా) తెలియ లేదోయ్! ఏమిటది!

పెంటు—పేఁస్ట్రాపుందీ బాబూ! నాగేశ్వర్రావ ఘర్ ను సీ[illegible] సూశారూ?

తిక్క—ఇద్దఱూం చేరింది?

పెంటు—ఖొత్తగా వొచ్చిన పిల్లాఅండీ.

తిక్క—అదిలక్ష్మి.

పెంటు—ఆ లచ్చిమి యేమేళ్ ఖాలగా పెట్టిందో బాబూ!

తిక్క—ఏం జరిగింది?

పెంటు—హేం జర్గిందా! తాధాఘూడ్కి హాళ్ళగ్యా ఘెగ్గి ఖషాళ్ళ తిర్గినై.

తిక్క—ఏం జేశాడు!

పెంటు——హేప్పీ సేస్తాడ్, హిల్లూ హాల్లఖందే, సేస్తాడ్. పాపం హదివర్కూ ఫెర్గూండ భారతి ఫిల్లా లేదూ...ఆ లడ్కీకీ హెల్లా కొట్టాడ్.

తిక్క——నిజమేనా? నిజమేనా? నాగేశ్వరావ్ లేదూ?

పెంటు——హోయన్కీ మాటా లెఖ్ఖాసేస్తాడా బాబు! నాగేశ్వరావ్ ఫూంర్ ఖూడా యేడకో లేసీ పోయినాఁక్.

తిక్క——(చేయి పట్టుకొని) భారతిలేదా పెంటు? భారతిలేదా పెంటు! నిజంగా చెప్పు?

పెంటు——లేదా, లేదూ హానీ గదండీ మీాంకీ సెప్తా.

తిక్క——పోనీ యెక్కడికి పోయిందో చెబుదూ?

పెంటు——నాకీసెప్పీ ఫంఘారండి నడిరేత్రి యేళాబైటీ కొట్టారంట, పొద్దునేడా ఖన్పడా లేద్.

తిక్క——(పెద్దపెట్టున పొంగి పొర్లుతూ వస్తున్న దుఃఖంతో) భారతీ! నా ఆంధ్రభారతీ! ఏ పరమ కిరాతకుఁడు నిన్ను వెళ్ళగొట్టెనే? ఆంధ్రభారతి! ఇంతలో యింత ప్రళయం వచ్చిపడుతుందని యెఱుగనే, ఆంధ్రభారతీ!

కీర్తన

ఉత్తమసాధ్వీ పరమసాధ్వీ
నాదుప్రేమ నిశీధీ ॥ఉ॥

ఘోరజగాన వీరయుగాన
కూలిపోయె కుటీరం

భారతీ
కూలిపోయె కుటీరం ॥ఉ॥

(పడిపోవును)

పెంటు—హేమ్టి? శాబూ! మీాకీ సాలా తెల్సినవారూ లెగండి. అరే! అల్లా! నాకీ బమ్మత్యాపాతం సుట్టుకుండేట్టుగా వుండే! ఉజే! బాబూజీ! పండిత్ సాబ్! లెగండి, పోయీా, హేడన్నా హెత్కోవొద్దాం ఖుదా! అరే! అల్లా! అబ్ మైక్యాకరూం? హా—ఇధీ సూస్తే నాగుండె బేజారై హోయిందే హేమ్టీ గచ్ఛంతరం? ఆ...ఆ తాథాంఫూడ్కీ. బుద్ధీలేన్, పాపిట్టిదాని మాటా యినీ ఖాంపాహీంకాడ్కీ చెచ్చాచ్. బుద్ధిగలబాబూ యీా ఘోరం సూడాలేకా దేశాంతరం లేసీపోయాడ్. హీంకా వుండదిగా మాతల్లీ...పోదోళ్ళ పానాల్కీ బలిసేస్తాన్కీ. ఈ లచ్చీ ఆతాథా నాకీ హింకా ఖళ్ళాలు పెట్టీ హామేషాతమా షాగా సవారీ సేస్తాగ్హూడా. హింకా నాకీ నౌఖరీ లేకాపోతే లేకాపోనీగానీ నాపిల్లా జెల్లాతో నేనూ లేసీపోతా.

(నిష్క్రమించును)

తిక్క—(లేచి అటునిటు చూచుచూ) పెంటు! పెంటు! ఆంధ్రభారతీ! ఎక్కడికి పోతివే? నీకష్టాలు విని ఆదరించువాడే లేడని పోతివా? నాగేశ్వరా! నీవుకూడా దేశాంతర గతుండ వైతివా? నాఆంధ్రభారతిగతి యింకా యెవరుచూస్తారయ్యా! ఇన్నాళ్ళు నేనుగూడా నీఅనుపమాన భాషాభిమానంచేతనే గదా బ్రతుకుచున్నది. నా సంగతి తెలుసుగా నాగేశ్వరా!

చేతన్ గవ్వయులేదు, నాదు మొఱ
కొంచెంబైన నైగొంటకున్
దాతల్ లేరు, నిరంకుశప్రభు కళా
దార్జన్య పర్జన్య శే

రీతా రావని నస్థి పంజరముగా
ప్రేలాడు యీ దేహమా ?
నాతంత్రీ! మన ఆంధ్రభారతికి ప్రా
ణాధార మీధాత్రిపై.

పాపభూయిష్ఠమైన దురంత ఘోర దారుణమారణవిషదంష్ట్రీ! కరాళింభరావేశ మరాళ వినాశకారణ లక్ష్మి! లక్ష్మి! ఛీ!

నీ మూలంబునగాదె ? నాదు మురళీ
స్నిగ్ధప్రసూనాంజలీ
ప్రేమారాధనమాగి, కష్టదిన మన
ర్ఘితాగ్నిలో వేగి, నేఁ
డీ మిన్నంటు విషాద గేయములతో
నేడ్చేడ్చి మున్నీరుగా
భూమిన్ పొంగి తుపాను బట్టినది క
ల్యూల్ కొంపలో రక్కసీ.

ఓ ఉన్నత పర్వతరాజంబులారా! ఓ గంభీర ఘోషరోషావేశ చతుస్సముద్రంబులారా! ఓ భయంకరారణ్య విహార వరాహ వ్యాఘ్ర నానావిధ శకుంతసంతానంబులారా! నా ఆంధ్రభారతి యెక్కడ ? నా ఆంధ్ర భాషాదేవి యెక్కడ ? (నిష్క్రమించును)

తెరపడును

2 వ రంగం తాత గృహం

[తాత విచారగ్రస్తుండై యుండును]

ఎందుకీ మాయదారి చదువులు కూటి కొచ్చేవా ? గుడ్డ కొచ్చేవా ? ఉన్నదాన్ని వూడ్చి పెట్టడానికే గాని మతేం గాదు. చదువులు చట్టుబండలు గాను, నేనీ చదువులు చదివే

యింత ఆస్తి ఆర్జించానా? ఏమిటో! ఇదంతా కలికాలమహిమ గాని మరేంగాదు. అయినా, యిప్పుడొక చిన్నా లేదు పెద్దా లేదు; ఎవరికి వారే పెద్దలు. మంచీచెడ్డా చెప్పేవాళ్ళు లేరు. వినేవాళ్ళు లేరు. నాకాశ్చర్యం వేస్తుంది! మా నాగేశ్వర్రావుతోటివాడు బొర్రన్న వాడొక్కడు కనబడుతున్నాడు పెద్దవాళ్ళ పేరూ, ప్రతిష్ఠా నిలపటానికి. వాడెంత వ్యవహర్తగా చెప్పుకో బడుతున్నాడు? ఊళ్ళో యే వ్యవహారం వచ్చినా వాడొస్తేగాని పరిష్కారం గాదు. వాడితల్లి యేం పూజచేసుకొని కన్నదో; వంశరత్నాకర మైనాడు బొర్రన్న, మాఆవిడా కనిపోయింది సుపుత్రుణ్ణి...సుపుత్రా కొంప ముకరా అని ఆ బొర్రన్న అసలు చెడుశాకీ స్నేహాలు పట్టేవాడే కాడు. మావాడు అట్లా కాదుగా. ఇంట్లో రంకులరాట్నాన్ని త్రిప్పే దాన్ని పెట్టుకొని లేకముందా కొడుకుతో సరసా లాడిస్తున్నాడు. ఇది నాకు గిట్టుతుందా? గిట్టకే చివాట్లు పెట్టానని లేచిపోయినాడు; వీడి మొగానికి బంగారంవంటి లక్ష్మిని కడితే, యీవరసను తెంపుకు పోతాడా? పోసి! ఇంకోత్తె తెచ్చుకొని పెంచుకుంటా. కలవా? కాకి చేత కబురుచేస్తేచాలు. రేపీపాటికి చాలామంది కొడుకులు నాయింట్లో దిగుతారు. నేను మానాటికి పనికిరాక పోయినానుగాని, దేశంలో వాళ్ళకి పనికిరాని వాణ్ణైనానా? వీడులకి శెల్లం చేదెప్పటికీనాడు.

[పెంటు ప్రవేశం]

పెంటు—అయ్యా! తాంధాఫూంక్!

శాంత—ఏమిట్రా! అబ్బాయికూడా యేమన్నా తెలిసిందా?

పెంటు—భారతీకి మొగ్గరాజాడా తెలిసిందీ బాబ్.

శాంత—(మొహం చిట్లించుకొని) ఏడ్చినట్లేవుంది నీ తెల్వి.

పెంటు—హార్కి హెతాకటాన్కి ఘంతే మద్దినా హీర్కిఖస్పడ్దార్.

తాత—ఆఁ, హా! సంతోషమే! ఇప్పుడీ వార్త చెబుతేగాని, నా ప్రాణం నిల్వాదని వచ్చావన్నమాట...మాయదారి ముండా కొడక! మాయదారి ముండాకొడకాలని, మాకెవరుదొరికినా యిటువంటి జెష్టలే దొరుకుతారేం? ప్రారబ్ధానికి తోడు.

పెంటు—తిర్గీ బేగీ హెత్కటాన్నీ పోయీావస్తాన్ గదండీ.

తాత—మళ్ళా రావటంకూడా యెందుగ్గాని తద్దినం...పే

పెంటు—హెక్కడ్కీ పొమ్మంటార్?

తాత—ఎక్కడికా? నల్లకాట్లోకి.

పెంటు—హక్కా బూడ్డా గదండీ.

తాత—నీవంటి గాడిదలకు పనికొస్తుందిలే...పొరాట్టానికి...పో, ఆక్టేవాక్క.

పెంటు—మీాక్కీ ఖోపం వేస్తే?

తాత—ఏమిట్రా ప్రలాపం? పొగరు బోతుతనం? పొమ్మంటేనా వొళ్ళు వాచిందా?

(పెంటు నిష్క్రమించును)

అడిగిన భత్యాన్ని మూటగట్టి అబ్బాయిజాడా తెల్సుకురారా అంటే, భత్యం కాస్తాయిట్లోపోసుకుని యెక్కడికి వెళ్ళాడోనేమో, మళ్ళా పందికొక్కల్లే మెల్లగాచేరాడు తిక్కన్నకనపడ్డాడని, ఆరి వీండిదుంపతెగ. తిక్కన్నకోపమా ప్రజ్ఞపంపింది? (చూచి) ఏడీ? పోయాడల్లేవుందే? ఒరేయ్! పెంటూ పెంటు!

(జీ, జీ, అని పెంటు తెరలో పల్కును)

తాత—ఆరివీణ్ణి పెద్దావులెత్తుకుపోనూ. అదుగో! ఇక్కడే చచ్చాడల్లేవుంది ఇట్లా వొకమాటు చావ్.

[జీ, జీ, అంటూ పెంటు ప్రవేశం]

తాత—అరి, నీజీ పాడైపోను. జీ అయ్యానుగానీకు ? పొగరెక్కి కొట్టుకొంటున్నావా ?

ఇదిగో ! బొబ్రన్నగారితో నే నొకమాటొచ్చి పొమ్మన్నా నని చెప్పిరా.

పెంటు—హార్కి లేకాపోతే.

తాత—చెవులు క్రిందుగా ముసుగు వేసుకు రా శకునపక్షి, నిన్ను నేను చెప్పింది చెసి చావటానికి పెట్టుకొన్నానా? సమాధానం చెప్పటానికి పెట్టుకొన్నానా ? పోయ్ చెప్పొస్తావా ?

పెంటు—(మౌనము)

తాత—మాట్లాడవేం రా ?

పెంటు—సమాధానం సెప్పొద్దన్నారుగదండీ ! నావమన్నారా ?

తాత—అఘోరించి నట్లుగానే వుంది. పోయి పిల్చుకురా !

(పెంటు నిష్క్రమించును)

కంటికి నిద్ర లేక, వొంటికి సుఖం లేక నేనావరస పడరాని పాట్లల్లాపడి లక్షలతరబడి సంపాదించా, ఏంప్రయోజనం? దక్కసిచ్చే కొడుకు పుడితేగా? ఇది వఱదాంకా, వూళ్ళో నానా అల్కి జనాన్ని తెచ్చి మేపాడు, అది చాల కిప్పుడు దేశంలో వాళ్ళనిగూడాతోలుకు రావటానికి పోయాడు. అవచ్చే వాళ్ళకన్నా సిగ్గూ భిడియం వుండొద్దూ ? తేరగా వాళ్ళతాతగాడి ముల్లె దాచిపెట్టినట్లు వస్తారు. ధూ...మనిషై పుట్టిం తర్వాత మానాభిమానా లుండాలి.

[బొబ్రన్న శనేశ్వర్రావ్ ప్రవేశం]

బొబ్ర—తాతగారు !

తాత—నాయనా ! వచ్చావా ? ఇంతకుముందే పెంటును మీకోసం పంపించా, కూర్చోండి.

బొంగ్ర—(కూర్చుంటూ) సెంటు కనపడ లేదే మాకు

తాత—వాఁడో త్రాగుబోతు ముండాకొడుకు. తాగి తందనా లాడు తున్నాడు కాంబోలు, ఎబ్బే, యీ సెంటు చురుకైన వాఁడు కాఁడు.

శనే—నాగేశ్వర్రావ్ కూడా తెల్సిందాండి ?

తాత—లేదు తండ్రీ !

శనే—బలే పని చేశారు. కానురా బొంగ్రన్న ! యీ వార్థక్యంలో నాయనమ్మగారుంటే తాతగారింత కష్టపడతారా ? నాగేశ్వర్రావ్ యిట్లా లేచిపోయే వాఁడేనా ?

తాత—(కన్నీళ్ళు తుడుచుకొంటు) అదుంటే నాకిన్నాళ్ళిట్లా యెందు కొట్టుల్తుంది నాయనా!...హాయిగా పార్వతమ్మవారి మాదిరి స్వర్గానికి లేచి పోయింది. నేనుగూడ పోకుండకు పోతే నాకీ నరకం వుండేది కాదు, మావాఁడికీ కంటకం వుండేదీ కాదు. (చప్పుడవటం విని) ఏమిటా చప్పుడు ? ఎవర్రా అక్కడ ?

బొంగ్ర—సెంటొస్తున్నాఁడేమో లెండి.

తాత—సెంటొస్తే చప్పుడేరాదు నాయనా ! చుట్టుపట్లకల్లా సుగంధం చల్లే సెంటుబుద్ధి యింకా వుందేమోనని పోకిరీముండాక చొర బడటం మామూలైందిగా నాయనా అదే నాకొంప కింత తిప్పలు తెచ్చింది.

శనే—మీ చేతిలో పెర్గిన పిల్లేగదండీ ?

తాత—పిల్లే, పాడైనపిల్ల, ఇంతకూ ఆ తిక్కన్నగాడి స్నేహం మా వాఁడు పట్టకపోనుగా...యీ భారతిట్లాగడేకారయ్యేది కాదు.

శనే—ఆ పిల్లని తిక్కనకిచ్చి చేయుటం మీ నాగేశ్వర్రావు కిష్టమేమో పోనీ అట్లా చేయకపోయినారా ?

ఎరిగొట్టు మొహాని కచ్చి చేస్తే పిల్ల సుఖపడే దెట్లా?
తను దూర సంబు లేదు గాని మెడకో డోలాలన్నట్లు ఆ తిక్కన్నగాడికి పెళ్ళా మెందుకు?

శనే—తాతగారూ! నాదొక మనవి.

తాత—ఏమిటో చెప్పు నాయనా!

శనే—మన బ్రోరన్న పెండ్లినిమిత్తం ఆలోచించటానికి వచ్చా.

తాత—మంచిదేగా నాయనా! అస లాభారతిని బ్రోరన్నకిద్దామని నేనెంతో ఆశపెట్టుకొంటే అదీమాదిరిబ్బద్దలైందిగా.

శనే—మతేం బ్రద్దలు గాలేదుగానండి, మీరు సమ్మతించే పక్షంలో, నేనొక సలహా చెబుతా వింటారా?

తాత—అయ్యో! వినకేం! అవశ్యం వింటా నాయనా!

శనే—తిక్కన్నని తిరిగి చూడకుండా శైముకు పంపటం, బ్రోరన్నకు భారతినిచ్చి వేయటం, నాగేశ్వరావ్ వచ్చేలోపల చేశా మంటే గోల చల్లారిందని విని వస్తాడు.

తాత—బాగానే వుందిగాని భారతి ఒప్పుకోవాలిగా.

శనే—మీ కెందుకు మీరు నాతోరండి, ఒప్పుకొ నేటట్లు చేస్తే నేసరి. ఇందులో మీరుమట్టుకు భారతిమీద అనుగ్రహం చూపాలి!

తాత—చూపకపోవటమేం నాయనా! అది నేను పెంచిన పిల్లగాదూ? దానికి నాకంటే వేఱే దిక్కు మొక్కూయెవరున్నారు?

[తిక్కన్న ప్రవేశం]

తిక్క—తాతగారు! నమస్కారం, నాగేశ్వర్రా వున్నాడా?... ఈ మనుమడి మీద అనుగ్రహం తప్పినట్లుందే? శనేశ్వర్రావు! నాగేశ్వర్రా వెక్కడి కెళ్ళాడో నీకు తెలుసా? ఓహో? బ్రోరన్నా వున్నాడే? నీకూ తెలియునట్టూ?...మీరంతా కలవాళ్ళు కాబట్టి పేదవాడితో చూట్లాడటం నామర్దాపని పాపం. తాతగారికి నాయనమ్మగారు పోయినప్పటినుంచి అన్నీ కష్టాలే.

తాత—(మొహం చిట్లించుకొని) చాల్లే వెధవ పరాచ్కం
దేన్ని లేవదీసుకు పోవటానికొచ్చావ్ ?

తిక్క—(నవ్వుచు) విన్నావా? శనేశ్వరా! తాతగారి పరాచకం.

శనే—ఇందులో పరాచక మే ముందిరా?

తిక్క—లేకపోతే సరేగాని, లేవదీసుకు పోయిన వాఁడెన్ని గుండెల్తో యిక్కడి కొస్తాడ్రా?

తాత—ఇళ్ళల్లో జొరబడే కుక్కకు సిగ్గా శరమా? చెప్పుదెబ్బలు తింటానికి వస్తూవుంటుంది, పోతూవుంటుంది.

తిక్క—రోజూ యింత రొష్టుపడకపోతే దానిక్కూడా యింతకూడు పడేస్తే కావలి కాస్తూ పడుంటుందిగా.

శనే—పెద్దల్తో పరిహాసం పనికిరాదు.

తిక్క—(రోషావేశంతో)

ఓరి! శనేశ్వరా! తెలిసె
నోరి! దురాత్మా! భవన్మహో దురా
గార కథా ప్రపంచ ఘన
సాహస కార్యము కట్టిపెట్టు; లే
దా, రుధిర ప్రవాహమున
తావక దేహము నిల్పఁబెట్టు, నీ
ధీరతనమ్ము కన్గొనెద దేనికి
వట్టి వృథా ప్రలాపముల్.

(నిష్క్రమించును)

తాత—ఆరి టక్కరిముండాకొడకా! ఎంతలోకూనై గండైనావురా!

శనే—కానీయండి, వీఁడి ప్రతాపం ఏమాత్రందో త్వరలోనె చూపిస్తా

(నిష్క్రమింతురు తెరపడును)

—♦—

*

# తెనుఁగుతల్లి

## తృతీయాంకము

1 వ రంగం, నదీతీరము.

[కృశీభూత శరీరురాలై భారతి ప్రవేశము]

కీర్తన

పోవే! ఇఁక నీవో ఆశా!
లేదే! అపేక్షా! పరీక్షా! నిరీక్షా!
బ్రతుకే వృథా ఆశా; ఆశా ॥పో॥
లేరే! కృపాళుల్ నీమొఱలు వినన్
పోవే! నీవో ఆశా! మహాదురాశా. ॥పో॥

సమస్త చరాచర జీవకోటి కయి నానా కష్టాలుపడి, కడుపు తీపితో బిడ్డల్ని మోయుచున్న భూమాతా! ఈ ఆంధ్రభారతి నీకు భారమా? కూడూ, గుడ్డా, కఱవై నిలువనీడలేక, దిక్కూ మొక్కూ గానరాక, నిస్త్రాణచే అల్లాడుచున్న యీ బిడ్డపై జాలిలేదా? ఓ భూదేవీ! నీహృదయంలో చల్లని కరుణారసం లేదా? నా కడగండ్లు కన్పడటం లేదా? బొమికల గూడైన ఓ తెన్గుచేడియ! క్షమాగుణ సంపన్నురాలైన యీ భూజననికి నీ బ్రతుకు భారమే కాఁబోలు, మిన్నకున్నది.

నీ కెవ్వరింక దిక్కు ? దిక్కు మొక్కు లేనివారి జీవితం నిరర్థకం ఆ సువర్ణసౌధాలవారికి, అఖండ భూమండలాధిపతులకు; ఆసుకుమార కుమారులకు పనికిరాని జీవితం వ్యర్థంకాదా ? లేకున్న వారు నిన్నెట్లల చూచెదరు ? గనుక ఈ మృతకళేబరముపై అపేక్ష వీడి ప్రాణాలు వదలి నీతండ్రుల దగ్గఱకు పొమ్ము. ఆంధ్రభారతీ ! తలిదండ్రుల్లేని బిడ్డలకు తరుణోపాయ మాఖరి కిదియే ! గంగాభవానీ ! త్రిలోకైక పావనీ !

మండువేసంగిలో మలయమారుత మిచ్చి
కాపాడుకొనుచున్న కన్నతల్లి
జడివాన పడునాఁడు కడు సంభ్రమము నిచ్చి
మేరు వెక్కించు బంగారుతల్లి !
చలిగాలి కసరి విసరురోజు బలమిచ్చి
ప్రభ సాగఁజేయు వరాలతల్లి !
సర్వ పర్వదినాల గర్వాతిశయమిచ్చి
ఆశీర్వదించు ముత్యాలతల్లి !
స్వర్ణ కేదారఖండ భాస్వత్ప్రదీప
రూపరేఖాంశలాక లక్ష్మీపతాక
మాంధ్రభారతి కింక నీ యండఁజూపె
కలుపుకొనుము నీలోన గంగాభవాని !
(గంగలో దూకి కొట్టుకుపోవుచుండును)

తెర పడును

[Next scene విచారగ్రస్తుఁడైన తిక్కన్న ప్రవేశం]

కీర్తన

ఓసీ ! సురమదగజగమనా ! కనవే కనవే ?
మృదుపాణిన్ ! నామృదువీణారాణిన్ !

నాగానామృతపాణిన్ ! కనినావే ?
యమృమధుజీవనా ॥ఓ॥

ఎంత తిరిగిననూ ప్రయోజన మేమున్నది ? ఎవర్నడిగిననూ తగినజాడా విప్పిచెప్పటం లేదు. నడిరాత్రివేళ ఆ పరమలుబ్ధాగ్రేసర చక్రవర్తిచేత గెంటబడటంవల్ల యే పెద్దపులినోట నైనా పడెనా?

(గద్గదికమున) నా ఆంధ్రభారతి ! నీవీ తెనుఁగుగడ్డపై జీవించియున్నమాట వింటినా...చాలు. ఈ దిక్కులేని బొందిలో ప్రాణాలు పెట్టుకొని జీవించుచుందునే ! నా ఆంధ్రభాషాలలామా ! ఇంకా నా కంటికి కఱవై పోతివా ? (ముందు చూచు) ఆ యేట్లో కొట్టుకొస్తున్నది శవంగా వున్నదే? పాపం దిక్కు మొక్కు లేని జీవితాలు యిట్లా యేట్లోఁబడి యెన్ని కొట్టుకపోవుచున్నవో ? స్త్రీశవంలా వున్నదే ? (సమీపించి పెద్దగా) ఎవరో కాదు ఎవరో కాదు, నా ఆంధ్రభారతి ! నా ఆంధ్రభారతి ! (అని గంగలో దూకును)

(పిమ్మట విషాదవాద్యములు వాయించుచుండవలెను)

(next scene) తీయవలెను

[భారతిని చేతుల్లోఁబెట్టుకొని బురదగుడ్డలతో తిక్కన్న ప్రవేశం]

(శవాన్ని దింపుకొని)

తిక్క——నా ఆంధ్రభారతి ! నన్ను వదలిపోతివా ? నా ఆంధ్రభారతి ! నిన్ను విడిచి నేనీపాపిష్టి జీవితం గడుపుకొనుచుందు నను కొంటివా? నా ఆంధ్రభాషాస్రవంతీ! ఆ ధనపిశాచి, ఆ కఠిన పాషాణహృదయుడు, ఆ ఘోర కార్య ఘటనాకిరాతకుఁడు, ఆ సాధుజనప్రాణఘాతకుఁడు నిన్ను వెళ్ళగొట్టిన వార్తవిన్నప్పటి నుంచి, నిరాహారదీక్షతో నిరాధార కుక్షితో నిద్రమఱచి

నీకోసం దశదిశలు వెతికి బక్క చిక్కియున్న నాపైకోపమా?
నా ఆంధ్రభాషామతల్లీ! నన్నెవరి కొప్ప చెప్పిపోతివే?
మునుపు నీచిరునవ్వు మువ్వల ధ్వని కాదె
తెనుఁగు కోడెలకు తెచ్చినది సొగసు?
వెనుక నీరవ్వాల వెలుఁగులో జిగి కాదె
తెనుఁగుతోటలకు పెట్టినది వన్నె?
మొన్న నీకమ్మని ముద్దుముచ్చట కాదె
తెనుఁగు కీర్తికిఁ గట్టినది మేడ?
నిన్న నీ కన్నీటినీలాలు పడి కాదె
తెలుఁగు జననిని ముంచినది జలధి?
నేఁడు నీ దిక్కు మొక్కులేని గతి కాదె
ప్రళయకాల భయంకర వాహినీ వి
శేషమై నిన్ను మ్రింగవచ్చినది తుదకు
చనవవా? నాదు ఆంధ్రభాషాలతాంగి.

(మీఁదపడి యేడ్చుచుండును)

ఓ తెనుఁగు తండ్రుల్లారా! ఓ దయామయుల్లారా! ఓ స్వదేశ భాషాభిమానుల్లారా! ఓ ఆపద్ధారకుల్లారా! మీకు మీ ఆంధ్రభారతి యిక్కట్లు కనిపించటం లేదా? తెనుఁగు తండ్రుల్లారా! కనిపించటం లేదా?

అకటా! నా గుణప్రసూన కవితా
వ్యామోహినీ స్వర్ణ వ
ల్లికి, నా మంజుల వాక్సుధాజలధికే
శ్రీమాధురీ రత్న పీ

చిక నా పున్నెపు టాంధ్ర భారతి కటా
జీవించుటే మీకు గి
ట్టక నట్టేటను ద్రోసిరా? తెనుఁగు బి
డ్డా! జాలి లేదేమిగా?

నా ఆంధ్రభారతి! నిన్ను నాప్రాణాలకన్న తీపిగా జూచుకొనుచుంటినే! నేనేమి నీకుకష్టం కల్గించానని నన్నువిడిచి పోవుచున్నావే? నా ఆంధ్రభారతి! నన్నుగూడా నీతో తీసుకొని పొమ్ము. తీసుకొని పోవా?...ఇంకనూ స్పృహరాకున్నదే?...ఓ పాపిష్టి ధనమదాంధులారా! ఓ పరభాషా వ్యామోహ పిశాచదాసదాసాధముల్లారా! ఓ స్వదేశాభిమానశూన్యుల్లారా! మాతృద్రోహుల్లారా!

ఓరి! కృతఘ్నులారా స్వకు
లోన్నతి మాపెడి మూఢులార! మీ
పౌరుష మిద్దిరా! పడిన
పాట్లకు నైపుచు నాంధ్రజాతి దు
ర్వారయశఃపతాకమును
బట్టిన తల్లిని చంపుటయ్య చ
ల్లారెనటయ్య మీకనులు?
అయ్యలార! ముదమ్ము జెందుడీ.

నా ఆంధ్రభాషాలలామా! నీకు నేడెంతగతిపట్టినదే నాఆంధ్రభారతి!

[ఏడ్చుచూ భారతిమీద పడి వుండును]

కూలివాడు ప్రవేశం

కీర్తన

రేపు మాపు కూలిదొరే మోసేదొ రోరు
కాసేనొ రోరు కూలిరాజుకసరి

పడిన నిలుచునదే భూమీ ?
కడలిన దుమ్మును గడచే
పిడుగు లప్పుడు పడవచే ?
అడలక, ఆలయక, అలగక అఖిలధరణితనియగా రేవు॥

కూలి—ఓరండి బాబు మీరో ?
తిక్క—దిక్కు లేనివాళ్ళం.
కూలి—ఆ ఆడకూతు రోగండి ?
తిక్క—నా యిల్లాలు నాయనా !
కూలి—అయ్యో పాపం ? యెట్లాపడిందా యేటండి ?
తిక్క—అవున్నాయనా ! దిక్కు మొక్కు లేనివా ళ్ళేట్లా పడాల్సిన కాలమేగా నాతండ్రీ ! ప్రాణం వుందో లేదో తెలియుటంలా. నీవు చూద్దూ ?
కూలి—(దగ్గరకొచ్చి చూచి) నీళ్ళొట్టే తాగలేదుగానుంది (నాడి చూచి) పాపం వుండదిలెండి.
తిక్క—(ఆదుర్దాగా) ఉందా నాయనా ? ఉందా నాయనా ప్రాణం? (ఏడ్పుతో) నా ఆంధ్రభారతి ! నా సర్వస్వం ధారపోసి కాపాడుకొంటా.
కూలి—మీరట్టా గోలెట్టకండి. కొంచెం పానం పోసుకోనియ్యండి, ఈ మా తల్లి కెంతకట్టం పుట్టియేట్లో సద్దాదోనండి సామీ ?
తిక్క—నాయనా
కూలి—మీ కట్టాలు దీరిందాకా మాయింటికాడ వుండండి. మా కుండ దాంటో మీకేం లోపం సేయం లెగండి
తిక్క—ఆపద్బాంధవా !

ఇన్నివరాల మేడలు ము
తిన్నిసువర్ణపు దేవిడీలు ము

న్నన్నియు చోట్ల కట్టుకొని
యేలిక యీ సుకుమార రాజసం
పన్నులు మోయలేని కసు
భారము మోతువ? కూలి తండ్రి! ని
న్నన్ని తరాలకున్ మఱువ
దీ మృదువాణి మదీయ రాశియై.

కూలి—సామీ! మీ యంగోర్ని మోయటం మాకేం బర్వు తెగండి, మఱి మాయంటి పేదోళ్ళ కొంపలు పున్నింగట్టుకొనే దేలాగండి? నాతల్లి కొంచెం వూపిరి పోసుకుండట్టుంది.

భార—(ఆవులింతతో) అయ్యా!

కూలి—(అనుర్దాగా) మా తల్లి మీకేం పర్వాలేదు తెగండి. మీ పనిమిట్టి యీణ్ణే వుంటారు.

తిక్క—నాయనా! ఏం కావాల్లో యేమో.

కూలి—సూత్తాం గదండి, యింటికాడ కెత్తి కెళ్ళాక.

[ఇనస్పెక్టరు పోలీసులు ప్రవేశింతురు]

ఇన—ఎవఁడ్రా నీవు?

కూలి—(అదరిపడి) కూలోణ్ణండి.

ఇన—తిక్కన్న వరు?

తిక్క—(నిర్లక్ష్యంగా) నేనే.

ఇన—నిన్నరెస్టు చేశా.

తిక్క—నేను నిరపరాధిని.

కూలి—(గడగడ వణుకుతుండును)

ఇన—అపరాధివే. కాశీనాథుని తాతగారింట్లో పడి సొమ్ము దొంగిలించుకొచ్చి నిరపరాధి వంటావేం; రాస్కేల్ షటప్.

భా౦౦—(లేవపోతూ) అయ్యా! వారే పాపం...
కూలి—నీకెందుకు నీవు మాటాడకమ్మా మాతల్లి.
ఇన—ఆ మెవర్రా ?
కూలి—ఆయనగో రిల్లాలండి, కాల్జా రేట్లో పడితే యిప్పుడే బైటికి
లెగదీశామండి మాప్పిబ్బో.
ఇన—తిక్కన్నా ! అనవసరంగా మాట్లాడక పద. ఏయ్ హాన్డ్రెడ్
ఫోర్ బేడీలు వేయ్.
పోలీ—రానయ్యా చేతులు రెండూ దగ్గటికి పెట్టు
తిక్క—వేయండి నాయనా !

(చేతులు జోడించి దగ్గటికి పెట్టి)

నను గైకొన్న కళాప్రఫుల్ల తరుణీ !
నా ఆంధ్రవాణీమణీ !
నిను నట్టేట మొసళ్ళకున్ నను సదా
నిల్పెట్టు సంకెళ్ళకున్
ధనగర్వాంధులు నొప్పఁ జెప్పునటు లీ
ధాత్రిన్ విధాత్రుండు వ్రా
సెను గాబోలును; దుఃఖసాగరములో
జీవించి జీర్ణింతుమే.

ఇన—(నెట్టుచు) పదా, గోలపెట్టక,
భార—(కాళ్ళుపట్టుకొని) అయ్యా! వారేపాపం యెఱుగరు.
పస్తులతోఁ గృశించి పయి
వస్త్రముతో శయనించి భూమిపై
పస్తు పరున్న వారికయి
వజ్రశిరము నీరయిన్ గటా

మాట వినవురా! ఇట్లా పొట్టనిండా మెక్కించబట్టే కాదూ యీ వరసన బలిసి సమాధానం యిస్తున్నావ్,

పెంటు—మీకీ సమాధానమ్.

తాత—నోర్మూయ్.

పెంటు—(ఉలిక్కిపడి చతికిలపడును)

తాత—పుండాకోరా! పుండాకోరా అని చచ్చినట్టు పడుండలేక ఏమిటా పొగరుబోతుతనం? నోరు మూసుకొని చావలేవ్?

పెంటు—(నోరు మూసుకొనును)

తాత—ఎక్కడికి చచ్చావ్? ఇక్కడచావరా అంటే పోయీ... బొర్రన్నగార్ని శనేశ్వర్రావుగార్ని పిల్చుకురా; పోవేం;

పెంటు—(నోర్మూసుకొని నిష్క్రమించును)

తాత—ఎబ్బ! ఇంట్లో కొష్టనకంటే వీడికి లొష్టెక్కువైందేముందు ఎట్లా వీండితో రోజులు గడపటం?

పరిత్రాణాయ సాధూనామ్। వినాశాయ చ దుష్కృతామ్.

[పెంటు నోరుమూసుకొని వస్తున్నారన్న సంజ్ఞ చేతులతో చూపటం విచిత్రంగా చూచి]

తాత—ఈ అభినయం ఏమిటి? ఈచేతులూపటం ఏమిటి? (పెంటు ఆ మాదిరిగానే దగ్గఱకొస్తుండగా) ఓరి త్రాగుబోతు ముండా కొడక! మదించి కొట్టుకొంటున్నావా యేం, కలేబడతావా యేమిట్రా? దూరంగా వుండమంటేను.

[బొర్రన్న శనేశ్వర్రావు ప్రవేశం]

శనే—ఏమిటండి తాతగారు!

పెంటు—పేంట్లీ లేదండి మీకీ వస్తుండారనీ సెప్తావుంటే గడబిడా సేత్తుండాగ్.

ఇదెంత మూఁరఖపు పపంచమో మీ యంటి దమ్మాత్ములంటే గిట్ట కుండా వుండాది.

(ఓదార్చుకొంటూ నిష్క్రమించును)

తె ర ప డు ను

౨ వ రంగం, తాతగారిల్లు

[తాత ఆలోచనా నిమగ్నుఁడై గీతాపారాయణ చేయుచుండును]

పరిత్రాణాయ సాధూనామ్ వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥

పెంటూ! పెంటో! ఎక్కడ చచ్చావురా? మలపగాడిద కొడక! మలపగాడిద కొడకా అని సూ! పిలిస్తే పల్కని యీ త్రాగుబోతు ముండాకొడుకుతో నాకన్నివిధాల చావొచ్చి పడ్డది. నేను ధ్యానంలో వుంటే సరి: సంగుదొరికింది, మెల్లగా జారటానికి తుప్పడల గాడిద గాడిద కొడుక! తుప్పడల గాడిదకొడుకా అని రా... ఇంటికి చెబుతా! ఎన్నో ఇటువంటి అనేకాన్ని గొప్పని శాస్త్రుస్లట్టు శాస్త్రుంటేగాని చిన్నగా పడివుండరు. పరిత్రాణాయ సాధూనామ్. వినాశాయ చ దుష్కృతామ్.

[పెంటు ప్రవేశం]

పెంటు—అయ్యా! తాతా ఘూరా! నాకే పిల్చారెందుకు?

తాత—ఎందుకా! చంక నాకటానిక్కి.

పెంటు—మీాకీ కోపం సేస్తాన్కి నేనేదొరాక్కి నేమండి?

తాత—అయింది. ఆరితుప్పడలగాడిదకొడక! నీవ్వుకూడాబోకరించటం నేర్చావ్? వుందువుగాన్లే బోకరించి వుందువుగాని. ఎప్పటి కప్పుడు మీాజాతి కొక చెంపన డొక్క మాడుస్తుంటేగాని.

మాట వినవ్రా ! ఇట్లా పొట్టనిండా మెక్కించబట్టే కాదూ యీ వరసన బలిసి సమ ధానం యిస్తున్నావ్,

పెంటు—మీాకీ సమాధానమ్.

తాత—నోర్మూయ్.

పెంటు—(ఉలిక్కిపడి చతికిలపడును)

తాత—వుండాకోరా ! వుండాకోరా అని చచ్చినట్టు పడుండలేక ఏమిటా పొగరుబోతుతనం ? నోరు మూసుకొని చావలేవ్ ?

పెంటు—(నోరు మూసుకొనును)

తాత—ఎక్కడికి చచ్చావ్ ? ఇక్కడచావరా అంటే పోయీ... బొబ్రన్నగార్ని శనేశ్వర్రావుగార్ని పిల్చుకురా; పోవేం;

పెంటు—(నోర్మూసుకొని నిష్క్రమించును)

తాత—ఎబ్బె ! ఇంట్లో కొష్టసంటే వీడికి బొష్టెక్కువైందేముందు ఎట్లా వీడితో రోజులు గడపటం ?

పరిత్రాణాయ సాధూనామ్ । వినాశాయ చ దుష్కృతామ్.

[పెంటు నోరుమూసుకొని వస్తున్నారన్న సంజ్ఞ చేతులతో
చూపటం విచిత్రంగా చూచి]

తాత—ఈ అభినయం ఏమిటి ? ఈ చేతులూపటం ఏమిటి ? (పెంటు ఆ మాదిరిగానే దగ్గఱకొస్తుండగా) ఓరి త్రాగుబోతు ముండా కొడక ! మదించి కొట్టుకొంటున్నావా యేం, కలేబడతావా యేమిట్రా ? దూరంగా వుండమంటేను.

[బొబ్రన్న శనేశ్వర్రావు ప్రవేశం]

శనే—ఏమిటండీ తాతగారు !

పెంటు—హేంట్లా లేదండి మీాకీ వస్తుండారనీ సెప్తావుంటే గడబిడా సేత్తుండార్.

తాత—(మొహం చిట్లించుకొని) ఏడ్చినట్టే వుంది నీ చెప్పటం కూర్చోండి నాయనా! తిక్కన్న పట్టుపట్టాడా!

శనే—పట్టుపడ కెక్కడికి పోతాడండి?

తాత—ఎక్కడ చిక్కాడు?

పెంటు—శనయ్యగార్కి తల్సుకొంటే యేడపడితే ఆడే సిక్కుతాడ్

తాత—ఆఁ హా సంతోషించాం లే, నీకు కట్టిపెట్టు అరెష్టుచేశారా?

శనే—అరెష్టు చేశారండి, రేపే విచారణ. ఇందులో మీరు చాలా బందోబస్తుగా సాక్ష్యం పెట్టుకోవాలి.

పెంటు—మీకీ వుండార్గదండి.

తాత—పుండాకోర్! నిన్నుగాదట్రా మాట్లా డొద్దన్నది. పో, అవతల్కి, నాయనా! సాక్ష్యంగూడా మిమ్మే పెట్టుకోవచ్చా?

శనే—(ఆలోచించి) పెట్టుకోవచ్చులెండి.

పెంటు—నాకీ ఫసీక్రానండీ?

తాత—(కోపంతో) నోర్ముయ్. వళ్ళు వాచిందా? నాయనా! ఈ ఘోరం కళ్ళారా చూచినవారు మీరుంటే యింకాకావాల్సిందేమిటి?

శనే—ఏమీ అక్కర్లేదు గానీండి.

తాత—నాయనా.

శనే—తిక్కన్న మిమ్ము స్పృహ తప్పినట్లు కొట్టిన జాడా కన్పడాలి. డాక్టర్ సర్టిఫికెట్ కావాలి.

తాత—కట్లు కట్టించుకొని దాని కెంతైనా పెట్టి డాక్టర్ సర్టిఫికెట్టు తెప్పిస్తా.

పెంటు—హింకా యేమండీ. ఆ తిక్కన్నభూడ్కి సిచ్చొపడిం దన్న మాటే.

తాత—సరేలెద్దూ సంబరం, ఆ భారతి జాడా యేమన్నా!

శనే—తిక్కన్నగాడు భారతిని కలుసుకొన్నప్పుడే అరెస్టు చేసింది.

పెంటు—అరే అల్లా! హైతే భారత్కి గతి ?

తాత—అరి నీయిల్లు వల్లకాడైపోను నీకెందెకురాసోది ? నోర్మూసుకొని పడుండలేవ్?...అయితే భారతి యెక్కడున్నట్టు నాయనా ?

శనే—కూలివాఁ డెవఁడో తీసుకుపోయినా డట.

తాత—అరి వాడి దుంప తెగ. వాఁ డెక్కడదొరికాఁడు ? లొంక్కరాకపోయినారా నాయనా ?

శనే—అంత సాహసం మాకప్పుడే యెక్క డిదండి ? మీరు వెళితే గాని కదలిరాదు.

పెంటు—అరే! వాకీ హెళ్ళీనా ?

తాత—(పండ్లు పటపట కొఱికి) తెంపిన్నగ తెంపి: నివో లెఖ్ఖాం ? దాన్ని నేనుగా తీసుకొచ్చి బొఱ్ఱన్న కొప్పజెప్పేది. తిక్కన్న గాడికి కఠినశిక్ష పడటాని కెంతైనా ఖర్చు పెట్టాలనుకొన్నా, అంత మందుకు పోతున్నది.

పెంటు—ఆ నమ్మక్ హరాం చేసినదాన్కి.

తాత—కూడా సి వేమిట్రా తానాతందానా ? (కన్నీళ్ళు తుడుచుకొంటూ) ఈ ప్రయత్నాలన్నీ అయిన తర్వాతన్నా, మా నాగేశ్వర్రావ్ వస్తాడా తండ్రీ ?

శనే—మీ రట్లా కన్నీరు పెడితే, చిన్నవాళ్ళకి చాలా ప్రమాదమండి, కుశలంగానే వస్తాడు. బిడ్డలిట్లా దేశదిమ్మరులైతే పిల్లలఁ గన్న తండ్రికి సుఖమెక్కడిది ?

బిడ్డలకోస మెన్నియిలు
వేల్పుల కాళ్ళకు మ్రొక్కి, యీ
గడ్డపయిన్ సుఖంబులకుఁ
గర్వముపోయెడి పెద్దనాటిలోఁ

బిడ్డ యనుంగు తల్లిని, శు
భంబుగ నోడ్డన జేయు నాతండే
బిడ్డండుగాని, యిట్లులుగు
బిడ్డండు గొడ్డలిగాదె నెన్నిపై ?

తాత—యథార్థంగా అంతే నాయనా ?

శనే—నాగేశ్వర్రావ్ కేం పర్వాలేదులెండి. వస్తారు మీరు మట్టుకు అనుకొన్నట్టుగా తయారుగండి. వస్తాం. (లేచును)

బొంర—భయపడకండి తాతగారు! మీకేం ఫర్వాలేదు. శలవు.

తాత—ఇంకా భయమెందుకు తండ్రీ! జోడు నేత్రాలల్లే మీరుంటే (పంపిస్తూ) నా ప్రయత్నాల్లో వుండకున్నారు గామా ?

(నిష్క్రమింతురు)

పెంటు—హీళ్ళమూలంగానే యీ ఖాపరాన్కి హింతా తిప్పల్ వచ్చింది. అరే! యీ నమ్మక్ హరాంలూ ముసులోడ్కి సైతాన్లై పట్టారే. కాకికీ బిచ్చం పెట్టలేని నాలుక్కి హెంతా ఖర్చులో పడ్డాడ్ !

(నిష్క్రమించును)

తెరపడును

3 వ రంగం బొంబాయి పెద్దబజారు

[నానారకాల వస్త్రధారణ గల మనుష్యులు రిక్షాలమీద, మోటార్లమీద, సైకిళ్ళమీద, ట్రాములమీద కూలివాళ్ళతో మహా కోలాహలంగా వస్తూ, పోతూ వుంటారు. నాగేశ్వర్రావ్ మాసిన గుడ్డలతో ప్రవేశం]

నాగే—ఈ ఉత్తర దేశీయులు ఎంత ఆత్మవిశ్వాసం గలవారు ? ఎంత స్వదేశభాషాభిమానం గలవారు ? ఎంత అష్టైశ్వర్య సంప

న్నాలు ? ఆహా ! ఇంతటి స్వదేశ మాతృపూజాధురంధరుల్ని సంగ్రామరంగ పరాక్రమ వీరసింహుల్ని, సురుచిరాకార సుకుమార సౌందర్యవంతుల్ని, సులలిత వాఙ్మాధురీ దివ్యసాహిత్య కల్పతరువుల్ని, అనోన్యస్యాంగత్య సౌభ్రాతృత్వసాంప్రదాయ సద్యశోధనుల్ని, గన్న యీదేశమాత ధన్యురాలు. కాని యీదేశ గ్రామసీమల సౌభాగ్యమింత గొప్పగా లేకుండుట చేతనే, నేను కొంత గర్వించుచున్నాను. నా తెనుంగు దేశాన్ని చూచుకొని మురియుచున్నాను.

కఱకు శత్రువుల చిక్కని రుధిరమ్మును
పొంగించి తడిపిన పోటుగడ్డ
మురుగు దీనజనాళి మొఱలోని మోసము
చివురింపఁ జేసిన చేవనేల
సకల దిగ్గంధవ్యకుయశస్సుగంధంబు
జగిని మర్పించిన మొగలికోట
కమ్మని సుకవి శుకపిక గానమ్ములు
వెల్లివిరిసిన పవిత్రధరణి
లలిత నవరత్న తోరణములను గట్టి
ముద్దు లొలికెడి ముత్యాల ముగ్గుపెట్టి
వైరి గుండియపై జయభేరిఁ గొట్టి
నా తెనుంగుతల్లి చల్లని ఖ్యాతిగాంచె.

కాని దేశానపడి కష్టాలపాలై పస్తులతో రోజులు గడుపుకొలేక పిచ్చి అవతారం పడ్డ నీవంటి వానిమాట యెవరు లెక్కపెడతారు. నీ దేశగౌరవం యెవరు మన్నిస్తారు ? ఈ అత్యంతమనోహరం రాజవీధులు సువర్ణసౌధాలు నిన్ని మాదిరి చిన్నచూపు చూస్తున్న దానికి —

అకటకటా! శిరీషకుసు
మాంజలిలోఁ గల తెన్గు బిడ్డ! ని
ప్పుకణికలందు నీ విపుడు
పొక్కుట కిట్లరుదెంచి తయ్య? దే
నికి తలయెత్తఁ జూచెదవు?
నీదు సహోదరులైన వారి దృ
ష్టికె సరిపోని వాఁడవు, ప్ర
సిద్ధిగ నిన్నెవఁడింకఁ జూచురా?

స్వభాషా, స్వదేశమూ అన్న, ప్రాణాలు ధారాగతం చేయు వారికి యీ అన్యదేశీయుని అవస్థ ఏం తెలుస్తుంది? బిడ్డల ఆకటి బాధ కన్నతల్లి గుర్తించినట్లు పరాయితల్లి గుర్తించగలదా? దయా మయా! నే నీ దేశీయులకు సవతితల్లి బిడ్డడను.

అందఱు నీదు ప్రేమ నయ
నాంచల కాంచన పుష్పవల్లికా
సందరసాలసాల భవ
నమ్మున బెగ్గెడి ముద్దుబిడ్డలై
కొందఱు బక్కచిక్కి మఱి
కొందఱు మిక్కిలి బల్సిబల్సి, నేఁ
డెందుకు నోఁడొకళ్ళు కల
హించుట తండ్రి! యనుగ్రహించవే!

నా మొఱ వినే దిక్కులేదు కాబోలు, నోరుగలవానికే నీళ్ళు పుట్టని యీ దేశంలో నోరులేని అమాయకుల వం కెవరు చూస్తారు? నా తెనుఁగుతల్లి సంతానానికి యీ దురభిమానం, అసహనం, యే కోశంలోనూ లేదు. ఎంతమంది విదేశీయులు నా తెనుఁగునాడులో

జొరబడి బ్రతుకు తెరువు చూచుకొనుచున్నారో, పరాయి దేశస్థులే దీనికి సాక్షి,

బక్కచిక్కిన పేదవైన జోరీగలై
ముసిరి పీడించు కాబూలి జనులు
గొప్ప సంసారపు గూటి పిల్లలకు, రు
ద్రాక్ష పిల్లు లయిన మార్వాడి జనులు
తలలంటి యొడలంత ఫెళఫెళా విఱ్ఱుచు
నోముపుగాఁగూర్చున్న యోఢ్రజనులు
ప్రతివానిదోసిట గతిమాలిన కొళంబు
ధారపోయుటకు సాంబారుజనులు
యెచట స్థిరనివాసు లయి మహీస్థలిపయి
శ్రీనివాసులై, సామ్రాట్టులై, నియంత
లై, మనకు కడముంత లియ్యఁగ గనిరొ
ఆంధ్రమాతామతల్లి సాక్ష్యంబు నిడదె.

[మార్వాడీ ప్రవేశం]

మార్వా—తుం కౌన్ హో!

నాగే—మై ఆంధ్రా హూం ?

మార్వా—ఆంధ్రా!... క్యా కాం పర్ ఆర హేం హైఁ ?

నాగే—స్వతంత్రజీవన్ కే వాస్తే.

మార్వా—తుమ్హే స్వతంత్రభూమిమేంనహీంహో ?......ఛతో.

నాగే—జీ హాఁ.

మార్వా—(పోనూ) బాత్ కర్ నఖో, జావ్ రే జావ్.

(నిష్క్రమించును)

నాగే—కడుఃకారస హృదయులులోకంలో లేకపోతారా అనిస్వతంత్ర
జీవితాపేక్ష గలవాఁడు యిల్లు విడిచి బయల్దేరి పరిగ్రహించే

ప్రథమస్వాగతాలే యివి......(కోకిల కూత విని) పైగా ఆ
కందుకోయిల బడాయి దేనికి ?

జీవసుధారసమ్ము వెదఁ జిమ్మెడి
　　　　కమ్మని పూలతోటలో
మావి చిగుళ్ళు మెక్కి మధు మాధురి
　　　　గానము తీయు కోకిలా !
జీవము లేచివచ్చు మృతశీతల
　　　　గాలి కృపారసమ్ముచే
నీవక యున్న నీ ప్రణయ వీధికి
　　　　వత్తురె ? వచ్చి మెత్తురే ?

(నిష్క్రమించును)

తెర పడును



*

*

# తెనుఁగుతల్లి

## చతుర్థాంకము

### 1 వ రంగం, కూలి కుటీరం.

[ఒంటరిగా భారతి ఈతాకుల్తో చాపల్లుకొంటూ]

భార — కాయ కష్టంతో భార్యాభర్తలు సుఖజీవనంచేయటం కూలి లోగిళ్ళలోఁదక్క, మఱెక్కడ కనిపించటం లేదు. కనుకనే. వీళ్ళ కాపరాలు ధర్మదేవతకి విశ్వమానవకళ్యాణానికిఆధారాలైనవి. ఇతరుల్ని హింసించి జీవనోపాధికి నానావిధాలా ఆయాసపడుతున్న వాళ్ళకి జీవితంలో చల్లని శాంతిస్వభావం, కమ్మని సుఖజీవనం దొరకదు.

మండుటెండలోఁ బడి మేని కండరములు
కరగి, బొమికెలు పగిలి, సుస్వరము నుడిగి
ప్రకృతి సౌందర్యవతికి నీరుఁబోసి,
వస్తు లున్నారు కూలిదంపతులు నేఁడు.

నాకు సోమరితన మిచ్చి కష్టసుఖాలు తెల్సుకోకుండా చేయుచున్నారు, అదిగో! నాకూలి తండ్రులుబొమికలుప్రోగులై వస్తున్నారు.

ఓ పాపిష్టి జీవితమా? నీకెన్నఁడు ఆకూలీల కష్టం తెలిసి వారితో కలిసిపోదువు. (చాపల్లుచుండును)

(కూలీలు కూలివాఁడు, దుర్గ కూలిపనికిపోయి వచ్చుచుండెదరు)

(భారతి నిలబడి చూచుచుండును)

కీర్తన

లేవగదయ్యా నీవు కార్తీకరాజా !
లేదుగదయ్యా కూడు కార్తీకరాజా !
నీళ్ళేసి రకతము, కొరికేసిరి గొంతుక లవిగో
ఏడుండె ససిగల పబులోకం ?
నాయము దయతో యేలాగా ॥ లే॥

ఒకకూలి—ఓరేయ్ ! యెంకన్నా పెందలకాడే బువ్వతాగి బొర్రన్నగారి సేలోకి సదండశా !

రెండవకూలి—ఒరే చిన్నోడా ! కూసింత పొగాకెట్రా నోట్లోకి.

కూలి—అరి పదండ్రా యెదవనాయాల్లా ! ఇయాలకూలిగింజలు కొలిపించండే పొలంలోకి ఓడూంకాలెట్టొద్దు.

కూలీలు—నిజంగా అందేరా సిన్నోడా! రా అశా; పోదాం (కూలీలు నిష్క్రమింతురు)

భార—జననీ జనకులారా! నన్నుకూడా మీతో కూలికితీసుకుపోరా ?

దుర్గ—తల్లీ! నీ కెందుకమ్మా కష్టం !

కూలి—ఒనాఁడన్నా యీ సరస్వతమ్మోరు యీ యాలదాఁకా కూసింత అంబలిలేక పఉండ దంటే !

దుర్గ—అందుకా, మనతో కూలి కొస్తాననటం ? నిన్నొక్కదాన్ని బ్రతికించుకోలేఁటమ్మా పిచ్చితల్లి !

భార—మీవంటివాళ్ళ కష్టాల గోపురంలో నావంటి సుకుమారిది పెరగటం యే ధర్మం వప్పుకోదు.

దుర్గ—ఏ ధర్మాలు సమ్మతించకపోయినా మాధర్మంయే మొదలిపెట్టం

కూలి—పెంటుసాయబయ్యగా మోసు వత్తుండాడు, అన్నట్లు రేపేగా తిక్కన్నగోరి కేసు యిసారణ.

[పెంటు ప్రవేశం]

కూలి—రండి సాయబయ్యగారు, యీాడ కూకోండి.

పెంటు—అరే ఖూకోటాన్కేంగాని, నీకీ సాలా పనీ పడ్డాద్.

కూలి—మీా దయవుంటే సాలు బాబు, బతుకుతాం.

పెంటు—అధీ గాదోయ్ ఘూడ్వా, హీప్డూ నీకీ దయాకావాలా!

దుర్గ—పేదవాళ్ళ దయ మునుపెవర్కి అఖ్లేక పోయిందేం సాయ బయ్యా!

పెంటు—హాప్డూ మన్కి థక్వె యేదీ?

కూలి—నిజమే బాబో! అయితే, యేం పనండి వుండదండారు?

పెంటు—అరే, నీకీ రోజుల్ ఖల్సివచ్చాయోయ్, సాచ్చంకావాలానీకీ,

కూలి—మాకేం పున్నెం పాపం తెల్యాదుగా బాబో!

పెంటు—అరే, దివానల్లెవుండావ్, మాకీ హేంమీా సెప్తామో, నీకీఅదీ సెప్పూవబే.

కూలి—మీారుకూడా వుండారాయేం?

పెంటు—మన్కి లేఖాపోతే, యేకతా సాగాదనో్కి, హేంమ్టామతే!

కూలి—ఏం సెప్పాలండి?

పెంటు—అరే, హేంమ్టా లేదోయ్. తిక్కన్నగాడూ, లేదూ హాడూ మా తాధాఘూడ్కి థలా పగ్లాగాట్టాడని సెప్పాలా.

దుర్గ—ఎందుకు సాయబయ్యా! అంత పాపం ఒడికట్టుకోటం?

పెంటు—నీకీ యేంతెలూస్ పెద్ద పెద్ధోళ్ళకీ థలా పగలాలా, మన్కి బత్కాలా.

కూలి—మాకు మాతెక్కలు బతికిత్తె లెండి బాబూ! మాకా పాపం కట్టకండి.

పెంటు—అరే నీకీ ఆసాదాసినూటా యినీ బాగూఫడవ్.

దుర్గ—నీలాంటి దళారీదార్ల మాట విని బాగుపడతమా ?

పెంటు—మాటా యిన్కాపోతే సెడీపోతాక్.

కూలి—పోతే పోయినాం గానీండి, మా వల్ల కాదు.

పెంటు—ఖాకాపోతే, నాకీ వచ్చినా దండుగా లేదోయ్ నమ్మక్ హారాం.

[తాత ప్రవేశం]

(తాత రావటంచూచి భారతి నిష్క్రమించును)

తాత—ఏమిట్రా ? పెంటు! వాళ్ళ కక్కావల్సిం దేమిటోయిచ్చెక.

పెంటు—హళ్ళీ డబ్బూ సేదూ అయి దండి,

తాత—చేదూ లేదు సోదీ లేదు గాని, వాళ్ళతో బేరా లెందుకురా పాపం ? ఓరబ్బీ! మీకింములో వచ్చిపడే కష్టంగాని నష్టంగాని లేదు, పుచ్చుకోండి.

దుర్గ—ప్రొద్దు గూకులు చేసిన కష్టానికే యివ్వాల్సిన కులి సరిగ్గా యివ్వరుకదా స్వామీ ! ఈ దండుగ మీరెందుకు పడతారు గాని పొండి.

తాత—ఈ ఆడకూంతురు పిచ్చి బాగుల్దల్లేపుంది కాని పుచ్చుకోరా అబ్బి ! పుచ్చుకో.

కూలి—కష్టంచేసి పుచ్చుకోండ దేవంట పడద్దిగాని, యీలాంటితప్పుడు నాచ్చాల్తో పుచ్చుకోండేది వంటూ వుండదు. ఇంటా వుండదు బాబు !

పెంటు—మీకి యేదాంథం పెడుతుందిలే దివాన్ ...పోదాపదండి, ఈళ్ళీ సాచ్చం లేకాపోయినా ఫర్వాలేద్, మనిక్కి కావాల్సినా సాచ్చానిక్కి నేనుండాగా బాబు ! హాళ్ళీ నుచ్చానాప్పైం దేహాల్ద్లి పెడతానా !

తాత—అప్పుడు గాని, భారతి యెక్కడుందో కనుక్కో ?

కాలి—ఏడా దిక్కు లేకేనండి.

తాత—పుట్టిన లగాయితు మీరే దిక్కు నా చిన్నమాట. ఏదీ ? ఆభారతి నిట్లా పిలిపించు ? అదేమిటో కాస్తా అడిగిపోతా.

దుర్గ—రప్పిస్తాం గానండి. పంపించటానిక్కి మట్టుకు వీల్లేదు.

తాత—ఆ గడేకార్తైన భారతే మీరాక్షసాల్ని నేర్పి పలికిస్తున్నట్టుగా వుంది. పోదాం పదరా పెంటు! వీళ్ళు పంపించే దేమిటో ఆతమాషాగూడా యిప్పుడే చూద్దాం.

పెంటు—సూద్దాం లెండి. పీళ్ళకి ఘనిసూడుందే సాలొక్క పెద తామా! ముందు నాకే పోనీండి పీళ్ళ తమాసా సూస్తా.

(తాత పెంటు నిష్క్రమింతురు)

దుర్గ—చెప్పుడు సాక్ష్యాలు పెట్టుకొని తిక్కగున్న గారికి శిక్ష వేయించే! ట్లన్నే కనపడుతున్నారు.

కాలి—నాగొంతులో ప్రాణముండగా ఆ కొంపకి రానీను. భారత తమ్మను పిలు.

దుర్గ—అదిగో! వస్తున్నది. పాపం వీళ్ళకి కష్టకాలం యెప్పుడు గడచిపోతుందోగాని, యిరుపురి సుఖం పట్టలేకుండా వున్నారు. రా అమ్మా!

[భారతి ప్రవేశం]

భార—(దుర్గ దగ్గరకొచ్చి) అమ్మా! మాకోసం మీరెన్నివిధాల కష్టపడకపోతే విడిచిపెట్టరాదా!

బొమికలు పిల్లే లేఁ బవలు
పొట్టకుఁ బట్టెడుకూడు లేక, ప్రా
ణములకు శోషవచ్చి భువ
నమ్ములు మోసెడి కూలితల్లి ద్రి

విశ్వాముపయి నేడు దేవుఁడను
వాఁడొకడున్న, కనుగొనండె ? ని
న్న నిఁ లెడి యీనిరంకుశ ధనక్రిమి
జాతి మహాదురంతముల్.

కాంలి—అమ్మా ! మాంకు మీ వంటి బిడ్డలు యీ భూమిమీద వుండ టంసేతనే మావంటోళ్ళ కష్టాలు ఆలకించేవా రుండారు. మిమ్మల్ని బతికించుకోటమే మాపదాన దమ్మం.

దుర్గ—తిక్కన్నగారి కేసు విషయంలో మాఆస్తి, ధర్మ ధారా గతం చెసైనా విడిపిస్తాం. భయపడకమ్మా పిచ్చితల్లి ! రా ? దుఃఖపడక, (మెళ్ళోపట్టెడ దీసి) నామెళ్ళోపట్టెడ పెట్టైనా, తిక్కన్నగారి తరపున వాదించే ప్లీడరుగార్ని తీసుకరండి. (పట్టెడ యిచ్చును) మాప్రాణాలు ధారపోసి మీకొచ్చినపడ్డ కష్టం తీరుస్తాం, చింతింపకమ్మా భారతీ !

కాంలి—నేను ప్లీడరుగారికోసం పోయొత్తాను.

(నిష్క్రమించును)

దుర్గ—భారతమ్మా ? లోకంలో ధర్మం లేకపోలేదు. వుంది. ఎప్పటి కైనా ఆ ధర్మమే మీా కష్టాలు తీరుస్తుంది.

(భారతి, దుర్గ కలిసి పాడెదరు)

కీర్తన

జాలిగల కాల మిల - తరిగినది విఱిగినది
చీడపడిమాడినది, చిగురులెటు పట్టవిఁక
నీలమేఘుఁ డేల యిటు - కనికరము జూప డింక ॥జాలి॥

దుర్గ—(ఎదుటచూచి) మళ్ళీ యెదుక్కో తాతొక్కడూవస్తున్నాడు మూలావు పెంకి మనిషల్లే వున్నాడు, లోపలికిపో నీవు.

(భారతి నిష్క్రమించును)

[తాత ప్రవేశం]

తాత—చిన్నప్పట్నుంచి పెంచి పెద్దదాన్ని చేశాగన్క. నా ప్రాణాలేమిటో తెగ తెంపులుచేసుకోలేక పోతున్నై. ఏమిటో.ఎక్కడుంటే యేంలే, ఓసమ్మా! నీపేరేమిటో యీ పదిరూపాయలు మాపిల్లదాని కియ్యి, (రొండి సవరించును)

దుర్గ—ఇప్పుడేం అవసరం లేదుటండి.

తాత—దాని మొహం కాదు. అవసరం లేక పోవటమే? పస్తులు పడుకోంటుందా? ఇయ్యి. (ఇవ్వబోవును)

దుర్గ—కల్లో గంజో, మాతో తాగుంటుంది టండి.

తాత—దానికైనా కావల్లిగా, కూలివాళ్ళుమీరెక్కట్నుంచి తెచ్చి పెడతారు పాపం? తీసుకో. (దగ్గఱకొచ్చి పైపై బడి బలవంతంగా రెండు చేతులు పట్టుకొనుటకు, ప్రయత్నించుచుండ)

దుర్గ—(విదళించుకొని పెద్దగా) ఏమిటిది? వదలండి. అబ్బావదలండి.

తాత—అరవక, ఒక్కమాటు, నూర్రూపాయ లివిగో, తీసుకో, ఊం (ముద్దు పెట్టుకోన పోగా)

దుర్గ—(పడద్రోసి) అమ్మా! భారతి! ఈ దుర్మార్గుడు చూడు.

[పరుగున పోబోగా కూలివాడు ప్రవేశం]

కూలి—(తాత చేయి పట్టుకొని) ఏంటది? ఈ బాపనో డేమన్నా అన్నాడా!

తాత—పుణ్యానికి పోతే పాపం యెదురైందంటారే అట్లా వుంది

(వదలించుకొని పోబోవును)

కూలి—(పట్టుకొని) ఏడకయ్యా! పొయ్యేది! నిలు! ఏడొత్తావెందుకే ఏంటో సెప్పు?

తాత—ఓరబ్బి! నన్ను విడు బాగావుండదే!

దుర్గ—ఈ దుర్మార్గుడు (అని ఏడ్చును)

కూలి—ఏం చేశాడు?

తాత—ఏం చేశానా? మా పిల్లదానికి డబ్బుతీసుకోమన్నా, రప్పా? అన్ని విధాల మీతో చావొచ్చి పడ్డదే! విడు విడు, (విడిపించుకొనును)

దుర్గ—అట్లా, డబ్బు తీసుకోమంటూ వచ్చి మీద పడ్డాడు.

కూలి—వీడేనా! (గుద్ది) చావరా.

తాత—అబ్బా? నేనే పాపం ఎరగన్రా.

కూలి—(తన్ని) పానాల్తో పోతా యింకా! (తన్ని) పోయవాలంటూ?

తాత—(ఏడుస్తూ) ఆది నీచేతులు పడ (పోబోవును)

కూలి—(పట్టుకొని) సిన్న యీల పానా లుంటేగా పోనిత్తానా నా యీలాం (పట్టుకొని) చావ్.

తాత—అది నీదుంప నీళ్లోకెయ్యగా. నీయిల్లువల్లకాడైపోను. చంపుతావట్రా, (ఏడ్చును)

[భారతి ప్రవేశం]

భార—(పట్టుకొని) ఊరుకో బాబాయ్! కొట్టక, వదలిపెట్టు, (వేడుకొనును)

కూలి—(వదలి) ఆ భారతమ్మ మొగంచూచి వూరుకొంటున్నా, లేకపోతే (బిగ్గరగా) నీ చావ్.

తాత—(ఉలిక్కిపడి చతికిలపడి గడగడ లాడతాడు)

కూలి—నీచావ్ చూడండే వదిలేవాణ్ణా? పో (తన్ని) ఈణ్ణొంచి పాపిట్టి బాపనోడా.

కాంత—అమ్మో! దేవుడా! ఆరి పీడి చేతులుపడా, ఆరి పీఁడిల్లు ముద్రష్టమైపోను, (నిష్క్రమించును)

కూలి—సెప్పేయి నీరంగసీతులు, దూరేయి దొమ్మరిగుడిసెలూనా? ఈపాలి కనపడుసెబుతా, పదండే యింట్లోకి,

(నిష్క్రమించును)

తెరపడును



2వ రంగం ఖైదు

వార్డర్లు పారా కాస్తూవుందురు

చిరిగిన గుడ్డలతో, మాసిన గడ్డంతో

తిక్కన్న వుండును

తిక్క—డబ్బుగలవాళ్ళు లోకంలో సేయలేదంటూ లేదు. ఎంతపని కైనా తెగిస్తారు. వాళ్ళ చేతుల్లో త్రిభువనాలు పాలించే త్రిమూర్తులు తోలుబొమ్మలైనారు. కలవాళ్ళంటే కర్మసాక్షి గూడా కాళ్ళుపడతాడు. ఇహ ధర్మదేవతాబలం వాళ్ళ నేం చేయగలదు? ఎట్లా అడ్డుకోగలదు? అన్యాయానికి, అక్రమానికి, అగ్రపీఠం వేసి పాలిస్తున్న కాలం మా మొరెట్లా వినిపించుకోంటుంది? జాలిపడుతుంది? లోకంలో డబ్బులేని వాళ్ళు పూటాయూపాయితో సమానమే, ఎక్కడా చెలామణి కారు. అనివార్యమైన క్రౌర్యంతో, శౌర్యంతో, డబ్బుగల వాళ్ళు ప్రళయతాండవం చేస్తూ బ్రహ్మాండభాండం పగులఁ గొడుతున్నారు. పేదవాడి మాట పెడచెవి పెడుతున్నారు. ఆంధ్ర భాషాదేవిని వీధి కీడ్చి, పొట్టను మాడ్చి కటికివాళ్ళ కిచ్చి దూడబాతుల కేస్తున్నారు. చదువుకొన్న విద్వాంసుఁ

డంటే, కవి సార్వభౌముఁ డంటే యింత కార్పణ్యం, దౌర్జన్యం, యెందుకు చూపిస్తారో తెలుసుకోనేవా రేరి? అందఱూ డబ్బుగలవాళ్ళకి బానిసలే, నోరెత్తి అడుగలేరు. డబ్బంటే లెఖలేనివాళ్ళు ఒక్క నిరంకుశ కవిసామ్రాట్టులే, వాళ్ళని స్వేచ్ఛగా వదలిపెడితే బంగారుకోటలు పడగొడతారనీ, నవరత్నసౌధాలు కూలుస్తారనీ, పూలపాన్పులపై పొర్లాడుచున్న బిరుదు బొర్రలవాళ్ళని దొర్లిస్తారనీ, అందర్నీ సమానముగా చేసి పొర్లిస్తారనీ, భయభ్రాంతులై యిట్లా బంధిస్తున్నారు. పాపిష్టిలక్ష్మికి లలితసుకుమారి కావ్యప్రసూనమహిళాలలామమైన ఆంధ్రభారతిని దాసీదానిని చేద్దామని చూస్తున్నారు. ఓ కవిరాజశేఖరా! ఓ కవిపండిత వేదండమండలాధ్యక్షా! హార్యక్షా! ఏది నీనిర్వక్రపరాక్రమము? ఏది నీ అఖండ మార్తాండ మండితపాండితీ ప్రతిభావిశేషము? బానిసశృంఖలాబద్ధుఁడ వైతి వేమి? బంధింపఁబడితివేమి? నీసున్నితమైన మేధస్సు మొనవిఱిగి బండబారెనా? నీ పంజాగోళ్ళు బిగుపుతప్పి సళ్ళిచ్చెనా? ఓ కవికులపుంగవా! నీ ఆంధ్రభారతిని సవతులకు బలి యిచ్చుకొంటివా? నీకు కూడా నీ తనువుమీద ప్రీతి, తీపి పుట్టెనా? నీ అర్ధాంగియైన ఆంధ్రభారతి అభిమానాన్ని కాపాడుకోనేబాధ్యత నీకు గాక మఱెవ్వరి కున్నదిరా? పిచ్చివాడా! ఈ కారాగార ప్రాకారాల్ని పడగొట్టలేవా? ఈ అధర్మనిరంకుశ ప్రభుమత్తేభకుంభస్థలాన్ని చిట్లగొట్టలేవా? ఓ ఆంధ్ర కవిసార్వభౌమా!

ధరణిన్ వాఙ్మయ పీఠ మెక్కి బధాహు
ధర్మంబు శాసించి, త
త్సరణిన్ దూషణ భూషణంబులను శి
క్షారక్ష లుద్దించుచున్

సరసామోదము గాఁగ మానవ మన
స్సామ్రాజ్య సుశ్రాంతమున్
బరిపాలించు కవీశు వైభవము వి
శ్వ శ్రేయమున్ గూర్చురా!

ఓ కవికులచక్రవర్తీ!

నీ అమూల్యమైన శక్తి సామర్థ్యాన్ని మఱచి పిరికిపందవై చేతులు నలుపుకొంటూ, దేబిరిగొట్టు మొహం బెట్టుకొని చప్పని వ్రాతలతో, కూతలతో బానిస కవిత్వానికి అలవాటుపడి, యోత ముప్పు దెచ్చుకొంటివయ్యా?

పైఁబడి పీక నొత్తి పసి
పాపల నెత్తురు త్రాగు రోజు, నీ
పీ, బిగు కైతచే పిసిలి
పిట్ట క టీ నగిషీలఁ జెక్కుటల్
దేశౌ మొగమ్ము తుడ్చుకొని
దేశము కోసము ధారఁబోయు, మా
జేబులో కైత జీవితము
శీఘ్రముగా కవిరాజ శేఖరా.

[శనేశ్వర్రావు, బోర్రన్న ప్రవేశము]

బోర్ర—ఖైదులో పడ్డవాళ్ళకి వాగుడెక్కువౌతుం దేమిరా శనేశ్వరా?

తిక్క—కడుపులో చల్ల కదలకుండా పడున్న వాళ్ళకి బోర్రెక్కువౌతుం దేమిరా పరమేశ్వరా?

బోర్ర—నీవంటి వాళ్ళకి బుద్ధి చెప్పటానికి.

శనే—అంతే.

బోర్ర—(నిరసిస్తున్న ముఖంతో)

గోసమందేల యింక ? చెను
  రోజులలో బడియుండి గూడ పే
రాసలవేల ? నీ నగవు
  టబ్రుకణాలకు నోరి. నీ కళా
భ్యాసరస ప్రపంచ పరి
  పాలితశోభితభారతీ మహో
ల్లాస రసాలసాలము వి
  లాసముగాఁ జిగురించఁ గల్గునే ?

తిక్క—కూసం విడిచిన త్రాచుకు రోసం వుంటుందని యెఱుగవా ? తుషారానికి మోళ్ళు పల్లవిస్తయ్యని తెలియదా ?

శనే—అదంతా అనవసరం, నీకీ శిక్ష తప్పించాలని వచ్చాం. భారతి మీద మక్కువ లేనట్లు వృత్తాంతం వ్రాసియ్యి. నిముషంలో నీమీద కేసు తొలిగిస్తాం.

తిక్క—మెడ తొలగించినా పోము. జన్మజన్మాలకి మా స్నేహాలతె తెగిపోదు. ఇంక యీ బెడిదపు పలుకులు రాసికుడు. ఈ బందిలో ప్రాణా లుంచుకునేటుకే గాదు మట్టిలో కలిసిపోయి ననూ, మా అనురాగం చెడక స్థిరంగా వుంటుందని భావించుడు.

శనే—చెడతావు.

తిక్క—ఇంతకంటె చెడే దేమున్నది ? బావా ! ఈడాసికే సిద్ధపడే వున్నా.

బ్రాం—చెట్టు చెడే కాలానికి కుక్కమూతి పిందెలు పుడ్తాయని అంటారే, ఆ మాదిరి తయారైనాడు. మన కెందుగ్గాని పోదాం పదరా శనేశ్వరా !

శనే—నిజంగా అంతేరా ! (నిష్క్రమించుదురు.)

తిక్క:—నాహృదయ శయ్యమీద యిన్ని ముళ్ళున్నప్పుడు, నీకింత మక్కువెందుకే ఆంధ్రభారతి? ఈపరమ నిర్భాగ్యుడు నీఋణ మెట్లుతీర్చుకోగలడే? ఆంధ్రభారతి? తిండిలేక ఆకటి చిచ్చులో మలమలమాడి, చలిగాలికి వళ్ళు చిల్లులుపడి, బొమి కలగూడైన యీగర్భ దరిద్రుడుపై నీకెందుకే మోహము, నా ఆంధ్ర భాషాలలామా! ఇంతమంది కావలివాళ్ళని, యింటికి యినుప కటకటాల్ని త్రోసికొని వచ్చి నీవీ వికార స్వరూపుణ్ణి ప్రేమించి సంపాదించుకొనునదేమున్నదే! హామ్మ వృధా ప్రయాసపడి నీ సౌకుమార్యం సౌందర్యం వమ్ముచేసి కొనకుము, ఓరి! కఠినపాషాణ హృదయుఁడా! ఆసుకుమారిని, ఆ నవపల్లవ కుసుమ కోమలగాత్రిని, ఆంధ్రభారతిని, యెన్ని యిక్కట్లలోఁ బడద్రోసితివిరా! నిన్ను నమ్మినవాళ్ళ కిదేమి భాగ్యంరా? ఈభయంకర నిశాచర గుంపులోకి ద్రోలితివిరా! తిరిగి చూడఁగలావా?

దిక్కెవ్వండును లేక గోడుమని వీ
ధీన్ బడ్డ నా ఆంధ్రి! నీ
చిక్కుల్ దీరుట యెన్నఁడో, తెనుఁగు వా
సిన్ నిల్పువాఁ డెవ్వఁడో
చెక్కుల్ విడ్డిన పత్ములై కడమదా
రిన్ బోని యేకాత్ములై
మొక్కల్ వోయిన బుద్ధితో తెనుఁగు నా
ముల్ సాములన్ జేసిరే.

ఆంధ్రభారతీ! నీ కష్టాలు చూచి జాలిపడేవాఁడే లేడా? ఆంధ్ర పౌరుషం నీరసించెనా? ఆంధ్రవిజ్ఞానమార్తాండుడస్తమించెనా? ఆంధ్ర వీర శూరాభిమన్యు లడుగంటిరా? ఆంధ్రకీర్తిజ్యోతి చల్లారెనా?

ఏ కలికి మృగాల పీకలు తెగఁగోసి
కొనకు పసుపుపట్టె తెనుఁగుకత్తి ?
ఏ కాలు చీకటి మూకను చెండాడి
దిశ లెల్లఁ జేసెను తెనుఁగుచూడ్కి ?
ఏ దిక్కరుల గుండె భేదించి పగిలించి
ధ్వని తీయుచున్నది తెనుఁగు పిడుగు ?
ఏ కమ్మని సుకవి కోకిల కూతలోఁ
దేనె చిన్కఁకుఁ తెనుఁగురాణి ?
ఏ పరమ సుకుమారికా రూపవతికి
కనకమైగూడ మూర్ఛిల్లె తెనుఁగు తల్లి ?
చూడరా ! తెన్గుచేడియ గోడుసేఁడు
మనయశోధన ! ఆంధ్ర జీవనకుమార !

(సొమ్మసిల్లి పడిపోవును తెర పడును)

## 3 వ రంగం, కోర్టు

[బొబ్రన్న, శనేశ్వర్రావు, తాత, పంటు ప్రవేశము]

తాత—డాక్టర్ సర్టిఫికేట్టు చాలా? ఆయన్నిగూడా తీసుకురావాలా?

శనే—సర్టిఫికేట్టు చాల్లెండి.

బొబ్ర—మన ప్లీడరుగా రింకా రాలేదే ?

తాత—ఏమో ! జడ్జీగారు గూడా వచ్చే వేళైంది.

శనే—వస్తున్నార్లెండి.

(ఆదుర్దాగా) జడ్జీగారేనా ? అరి భగవంతుడ ! ఇంకా రాడా యేమిటి మా ప్లీడరు ?

పంటు—హాయుస్కీ రాఖాఫోతే జల్దీగా హింకో హాచ్చాఫీడర్కీ మై లావూంగ.

తాత—ఏవేళ యెటువంటిదో, యే మానవుఁ డెటువంటివాఁడో, నిజంగా నిన్ననే యింకో ప్లీడర్ని మాట్లాడుకో వల్సింది.

పెంటు—పానంమీాదకి వచ్చి వుం డప్పుడు ధేనై(క)నా, హింకోసత్ర కాయా వుండాలీ కాదుబాబు? హైతే యీా పీడర్కి రాశా ఘోతే మన ఘనీ యేం కావాలా?

తాత—ఆరి నీదుంపతెగ. అసలే ప్రాణా లెగిరిపోతాఁటే, వెంటనే నీవు చితి పేరుస్తూ కూడా వుంచు. 500 రూపాయలతో ఆప్లీడరు పోయాడు. ఇహ వున్నదాన్తో నీవూడ్చి పెట్టుకుపోదువుగాని,

పెంటు—నాకీ.

తాత—మాట్లాడక. ఒకటే వాగుడు. నాకు రేచికొ వచ్చిందంటే మనిషిని కాను.

శనే—అదుగో! వస్తున్నారల్లే వుంది.

తాత—(ఆదుర్దాగా) ఎవరయ్యా? జడ్జిగారేనా? అన్నివిధాల నా క్షౌరాని కొచ్చిందేంరా నడమంత్రపు కేసు!

బ్రొ—జడ్జీగారు కాదె! ముద్దాయి తరఫువ సాక్షులల్లే వుంది.

తాత—ఆఁ...ముద్దాయి తరఫువ సాక్షులు గూడానా?

పెంటు—పీడర్కి గూడా తెల్సుండారల్లే వుందే! (ఏమ్చూసో) అరే అల్లా! మా పీడర్కి కొడ్డానచ్చాడో?

తాత—ఆరి నీ యేప్పుముండ. ఏమిటీ వెధవేప్పు. ఎదురేడూప్తావు?

శనే—మన ప్లీడరుగారు వస్తున్నారెండి.

[ప్లీడరు ప్రవేశం]

శనే—నమస్కారమండి.

(అందఱూ నమస్కరింతురు)

ప్లీడ—సాక్షులంతా వచ్చారా?

తాత—వచ్చారండి.

ప్లీడ—అయితే, యిక్కడ్నే వుండండి, నన్నోమాటు జడ్జీగారు పిల్చారట—వెళ్ళివస్తా.

తాత—చిత్తం (ప్లీడరు నిష్క్రమించును)

శనే—మన కేసు విషయంలో మనప్లీడరుగారు గట్టిపట్టు పట్టినట్లు కనిపిస్తున్నది.

పెంటు—హిందు కేగా జడ్జీసాబ్ పిలిపిస్తాన్కీ ఖారణం

తాత—ప్లీడరుగారి కడుపులో జొరబడ్డ దేవుఁడు జడ్జీగార్లోగూడా జొరబడాలగా!

బ్రా—కూలివాఁడు సాక్ష్యానికి వస్తున్నాడు కాఁబోలు,

పెంటు—రానీండి. హాక్కీ మాటా జడ్జీలెఖ్ఖా సేస్తేగా?

[కూలి, దుర్గ, భారతి ప్రవేశము]

తాత—సిగ్గూ భిడియం లేని ఆడది గడేకార్లె కోర్టూ యెక్కుతుంది. గొంతుకూ కోస్తుంది.

పెంటు—ఔరత్కీ శరంహోనా, సాల్నాకీ గరంఘనా, సైతో బహుత్ ఖరాబ్ కర్నా,

శనే—బాగా చెప్పావు, నిజంగా అంతే,

దుర్గ—న్యాయానికి తిన్నని చూపుంటే యింత ఘోరాన్ని, నీలాప నిందల్ని తల యెత్తనిస్తుందా?

కూలి—అనాయం వొకటే గండలేమనంటోళ్ళి కాపాడుతుండది?

పెంటు—హిప్పూ యే నాయం కాపాడుద్దో సూత్తాంగా, బాత్ కర్ నఖో బద్మాష్,

తాత—నానా అడ్డమైన గడ్డీ కఱచి; మానాభిమానాలువిడిచి బైట పడ్డవాళ్ళకి న్యాయశాస్త్రాలు గూడానా?

[తిక్కన్నకి సంకెళ్ళు వేసి పోలీసులు తెత్తురు]

తిక్క—జాతి గౌరవానికి, సంఘ చైతన్యానికి గడ్డి కఱవాలి, అగచాట్లూ పడాలి వాళ్ళకోసం. ధర్మశాస్త్రాలు కదలి రావాలి.

(కూలి, దుర్గ, భారతి తిక్కన్నకు నమస్కరింతురు)

కూలి—దండాలండి.

భార—ఆంధ్ర కవిసార్వభౌమా! నమస్కారములు. (కాళ్ళమీద పడును)

దుర్గ—ఆంధ్రకవి చక్రవర్తీ! నమస్కారములు.

పచ్చిక మేసి లేగలకు
ప్రాణము నిల్చెడి పాలనిచ్చి వి
వచ్చని నిల్వఁబెట్టు గరు
వమ్మున కొమ్ములు వాలితేలి. మే
ల్కచ్చులుఁదాల్చి సీ పలుకు
గో వకటా! పులికంటఁబడ్డ మా
టెచ్చట విన్నవో పరుగు
లెత్తుచు నక్కలు నక్కజొచ్చెనే.

పోలీ—ఇది సర్కారువారి కోర్టు. మీ మీ నమస్కారాలు, పరామర్శలు యిక్కడ పనికిరావు.

పెంటు—ఇగ్ఘీ మొఖ్ఖూ భళ్ళా వఖ్ఖా హాను ఖోన్నా గేమొ.

తిక్క—నిజంగా కోర్టునాఁడు మొక్కుబళ్ళకు గుళ్ళే అయినవి. ఈ గుళ్ళల్లో దేవుళ్ళు యిఖ్ఖా వఖ్ఖా గుల్లఁజేసిగాని మోక్షం యివ్వరు. ఈ కోర్టు గుళ్ళల్లో పెట్టే సెడగోపురం వెనుకటి పితృదేవతల్నే గాక ముందు వచ్చే పుత్రి పౌత్రాదుల్ని గూడ మళ్ళీ తలెత్తనీకుండా తగింప జేస్తై.

[జడ్జీ, ప్లీడరు ప్రవేశం]

జడ్జి—తాతగా రెవరు ?

తాత—నేనేనండి, అదుగో ! వారేనండి మా ప్లీడరుగారు.

జడ్జి—ఏమిటండి ! మీరు తాతగారి తరపున వకాల్తాపట్టారా ?

ప్లీడ—యువరానర్ యస్సార్.

జడ్జి—ఏమండి ? మీ కంప్లైంటు.

ప్లీడ—యువరానర్ సార్ ! ఈ తిక్కన్న అర్ధరాత్రివేళ భారతి కోసం వచ్చి అడ్డంవచ్చిన యీ తాతగారిపై కలేబడి, ప్రాణాలు, పోవునట్లు కొట్టి సొమ్ము దోచుకొని పోవుచుండగా ఆరాత్రి అక్కడే పరున్న సదరు యీ శనేశ్వర్రావు బొర్రన్న, పెంటు సాహెబుగార్లు చూచి పట్టుకొని పోలీసుస్టేషన్ కి వప్పఁజెప్పి దీనికి వారే సాక్షులుగా వున్నారు.

జడ్జి—ఇది నిజమేనా సాక్షులు ?

సాక్షులు—నిజమేనండి.

జడ్జి—తిక్కన్నా ! నీవు ముద్దాయివని సాక్షులు సాక్ష్యమిచ్చారు. నీ వేమైనా చెప్తావా ? నీకు సాక్షు లున్నారా ?

తిక్క—అయ్యా ! ఫిర్యాదితరపు యిచ్చిన స్టేటుమెంటు, సాక్ష్యం, వట్టి అభూతకల్పన. వాళ్ళు చెప్పిందాఁలోనిది నేనేమీఱుగను, నిర్దోషిని, ఇందుకు సాక్ష్యం భారతినే కనుక్కోవచ్చు.

జడ్జి—భారతి యెవరు ?

భార—నేనండి.

జడ్జి—ఏమిటిది ? నీ వేమైనా యెఱుగుదువా ?

భార—అయ్యా ! ఫిర్యాదులు మీతో చెప్పిన దంతా వట్టి అబద్ధం)

తాత—అరి దీన్దుంపదెగ అయ్యా ! దీనికి పిచ్చెక్కిందండి. ఇంట్లో నుంచి లేచిపోయిందండి. దీనిమాట నమ్మకండి,

సాక్షులు—నిజమేనండి.

జడ్జి—ఇది కోర్టనుకొన్నారా? చేపల బజారనుకొన్నారా? ఎవరికి వారు లేచి చెప్పొచ్చా. నాన్సెన్స్?

ప్లీడరు—యువరానర్ సార్! వీళ్ళంతా తాతగారికియ్యాల్సినసొమ్మెగ వేద్దామనిభావించి, అడిగిందివ్వలేదని చెప్పి విరోధించి యిట్లా తిక్కన్న తరఫున తయారైనారండి.

తాత—అంతేనండి.

ప్లీడ—ఇష్. (గుద్దులుయి) మీరాగ్,

తాత—(ఉలిక్కిపడి వెనకున్న పెంటు మొహానికి తల కొట్టుకొని) అబ్బా! ఆరి సి దుంప తెగ. ఆరి సీదుంప తెగిపోతేను. ఎంత దెబ్బ తగిలిందిరా. మత్తే మీది మీదికొచ్చి చావకపోతే అవతల చావలేవ్?

ప్లీడ—మీరు మాట్లాడకూడదండి.

జడ్జి—భారతి! తిక్కనను నీ వెట్లా యెఱుగుదువు.

భారతి—నే నేట్లో బడికొట్టుకుపోతూండగా పైకిదీసి రక్షించటంవల్ల. ఈ కూలివాళ్ళే దీనికి సాక్ష్యం.

జడ్జి—కూలీలెవర్రా?

కూలి—(దణ్ణంపెడుతూ) మాప్పెబో! మేమేనండి. ఏట్లోపడినమాట సత్తెమేనండి, ఏణ్ణుంచో వత్తుండ తిక్కన్నగారు గచ్చించిన మాటా వాత్తతమేనండి.

జడ్జి—మీ మాటల్ని మిమ్మల్ని నమ్మటానికి వీలులేకుండా వున్నై. నీవు అపరాధివని రూఢి అయినది. నీకు శిక్ష తప్పదు.

(నిష్క్రమించును)

పోలీ—(శిక్షాపత్రము చదువును) చోరుడవని, నరహంతకుండ వని,

రుజువైనది. రేపు నీ చేతులు రెండింటిని నరకించి, రెండేండ్లు కఠినశిక్ష అనుభవించు టైదువిధించడమైనది.

జడ్జి.

(ప్రేక్షకు లంతా సంతోషంతో నిష్క్రమింతురు. పెంటు చంకలు కొట్టుకొంటూ అపరిమితమైన సంతోషంతో కాలుజారి పడి గిలగిలా కొట్టుకొంటూ లేచి నిష్క్రమించును)

తిక్క—(భారతి దగ్గరకు దీసుకొని) భారతి! నా ఆంధ్రభారతీ! ఈనిర్భాగ్యుఁడు నరహంతకుఁ డని రుజువైనది. ఈప్రాణఘాతకుఁడికి తగిన శిక్ష పడినది. వీఁడికోసం నీ వెంత యేడ్చి మొత్తుకొని కరగి సముద్రమైననూ, ప్రయోజనం లేదు. జాలిపడు కాలం రాలేదు. పోమ్మా. ఆంధ్రభారతి! పోమ్మా. ఈమందభాగ్యుఁడికోసం వాడిపోక. దేవుడూ దయ్యమూ అని మూఢకాలంలో వ్రాడిపోక. ఇంకెక్కడ దేవుడు? పేదవాళ్ళకి దేముడు లేఁడు.

దేవుఁడు దేవుఁడం చెపుడు
దేబిరిగొట్టు మొంబు వెట్టె యీ
దేవుకులాట లేటికి ? మ
దించి కుటీరపు కష్టజీవిలో
ప్రేవులు తీయువారి బలి
పించెడి దేవుని గొల్చు టేల ? ని
ర్జీవులపైన దేవునికి
ప్రేమ జనించునె ? ఆంధ్రభారతీ.

పోలీ—పదవయ్యా చాలుగాని (నెట్టుకొని పోవును)

భార—(దుఃఖంతో) నాఆంధ్ర కవిసార్వభౌమా! ఈఆంధ్రభారతికి దిక్కెవరు ?

కీర్తన

సరసులార! పురుషులార! దురితముఁ గనిరె?
దనుజహారుఁడు గలఁడే? ప్రళయమూర్తియై వసుధ కిక రాఁడె?
జపములేల? తపములేల? కలిలో ॥స॥

ఆగునా జగము? సాగునా యుగము? జలధులేడు కలసి
పొరలవే? సుగుణధనులు నిగమ ఘనులు కలరటె?
పులులపగిది తిరిగి ఖలులఁ గనరటె? ॥స॥

కూలి—అమ్మా! భారతమ్మా! నాకుండదంతా దాంపోసి సపెనిమిటిని యుడిపించుకొత్తారా! అమ్మా!

దుర్గ—ఏడ్వక తల్లీ! భూమిమీద ధర్మదేవత అంటూ వుంటే మీ కష్టాలు తీరకపోవులే రా! అమ్మా! భారతి?

కీర్తన

ప్రశాంత హృదయా! లతాంత తనుమా!
వీర సుమహిళా! వెఱవకమ్మా! ॥ప్ర॥
భారత యశఃకాంత ప్రణయా!
చింత మానవె! జీవ సదనా!
ఇక దేల దురంత భయము? ॥ప్ర॥

(ఓదార్చుకొనుచు నిష్క్రమింతురు)

తెరపడును



*

# తెనుఁగుతల్లి

## పంచమాంకము

### 1 వ రంగం, తాతగారి గృహం

[నాగేశ్వరరావు ప్రయోజకుఁడై వస్తున్నాడన్న వార్తవిని లక్ష్మి నానావిధములైన ఆభరణాలు ధరించుకొని అందాలు సవరించుకొంటూ ఆనందంతో]

కీర్తన

మనోహరుండే ప్రాణధనుండే
యిఁక వస్తాడే
నోముకదా పండె నా నోముకదా పండె
మాలతి సోఫా మణిమయదీపా
పసిఁడిగృహంబ కుశలము గనవె
వీణరాణి వినవె అనవే దివ్య
మంగళగీత సౌఖ్యప్రశాంత
సౌధవీధిలోన్ ॥మ॥

[తాత ప్రవేశం]

తాత—అమ్మా! లక్ష్మి! మాఅబ్బాయ్ నాగేశ్వరరావు వస్తున్నాడట.

లక్ష్మి—ఇంకా వూళ్ళోకి రాలేదా అండి.

తాత—ఊళ్ళో వాళ్ళంతా స్వాగత మివ్వడానికి ఎదురుగుండా వెళ్ళారట.

లక్ష్మి—ఇంటికి రాకముందే స్వాగతాలేమిటి! మీరు వెళ్ళి తొందరగా తీసుకురండి.

[పెంటు ప్రవేశం]

పెంటు—(హడావుడిగా) అయ్యా! తాథా ఘూన్! (కాలు జారి పడును)

తాత—ఏమిట్రా హడావుడి?

పెంటు—హబ్బాయ్ గార్కి వత్తుంటారండి,

తాత—సరేగాని, యెవరెవరు పెద్దమనుష్యులుకూడా వస్తున్నారో చూచిరా?

పెంటు—సిత్తం (నిష్క్రమించును)

లక్ష్మి—మాయదారి జనం యింటికి రాయరేమిటి?

తాత—ఏమిటో! ఈ జనానికి వేళా పాళా లేదు. ప్రయోజకుణ్ణి చూస్తే సరి, ఊపిరి పీల్చుకోనీయరు. సరేగాని తల్లీ! భారతి సంగతి యీ పాపిష్టి మూక చెబుతుందేమో.

లక్ష్మి—నాకూ అదే అనుమానంగా వుంది.

[పెంటు ప్రవేశం]

పెంటు—అయ్యా! అబ్బాయ్ గార్కి వత్తుండార్.

తాత—వస్తున్నాడా? వాకిట్లో జిష్టి గిష్టితీయటానికేమైనావుంచారా?

లక్ష్మి—ఉంచా.

తాత—ఆసోఫాలన్నీ దుమ్మూధూళీ లేకుండాదులుపుతుండ పెంటు,

పెంటు—సిత్తం (దుల్పుతుండును)

తాత—అమ్మా! లక్ష్మి! నేనబ్బాయి కెదురుగాం బోయి తీసుకొస్తా.

(నిష్క్రమించును)

లక్ష్మి—పెంటు! మీ దొరగా రెట్లావున్నారో చూచావా?

పెంటు—హిప్డూమీాకీ సూత్తారూ గదండీ.

లక్ష్మి—నీవ్వూ చూచానంటివిగా.

పెంటు—హేప్డూ వుండట్టుగానే వుండా నాకీ.....అదుగో వత్తుండా రండి.

లక్ష్మి—(ఎదురుగా బోవును)

పెంటు—భార్యాకీచూడా డబ్బు తెత్తుండద్డే మొగ్డూ, లేకపోతే పుట్టింటికి ధడ్డూ నిజంగా మొగుడూ పెళ్ళాలజత భారత్కీ తిక్కన్నకీ సరిపోయింది.

[లక్ష్మి పరుగుతో ప్రవేశం]

లక్ష్మి—వస్తున్నార్రా పెంటు!

పెంటుహిప్డూ బాగుండారా మీాకీ?

లక్ష్మి—సరేలెద్దూ, ఏమిటా వేళాకోళం.

పెంటు—అర్ధీగండకీ! హిప్డూ మీాకీ మహావైభోగం గదండి.

లక్ష్మి—చాల్లె, అవతలికి వెళ్ళు.

పెంటు—మాకీ హిప్డూ పన్కివోత్తామా?

[తాత నాగేశ్వర్రావు ప్రవేశం]

పెంటు—(సలాం చేస్తూ) సలామండీ అబ్బాయ్ గారు.

తాత—సరేలే నీ సలాములు, మలాములు, వాకిట్లో వుండు. ఎవర్ని యిప్పుడు రానీయక, తెలిసిందా?

పెంటు—ఇంగులో ఖొత్తా హేముందండీ ఖెల్యాక పోటాన్కి

నాగే—కులాసాగా వున్నార్రా నీ పిల్లలూ నీవు?

పెంటు—అయ్యా! మీాకీ దయావల్లా సల్లగావుండామండి.

తాత—సరేలేవోయ్, ఎవరొచ్చినా మాట్లాడటానికిపీల్లేదని చెప్పు పోవేం.

పెంటు—సిత్తం. (నిష్క్రమించును)

తాత—నానా! వంట్లో ఆరోగ్యంగా వుంటున్నదా?

నాగే—ఆరోగ్యంగానే వుంటున్నది, భారతి యింట్లో లేదా?

తాత—ఈమధ్యనే తీసుకొచ్చా నాయనా, తిక్కన్ననే పెండ్లి చేసుకొన్నది.

నాగే—తిక్కన్నెక్కడున్నాడు?

తాత—తిక్కన్నా? తిక్కన్నగూడా యిక్కడ్నే వుంటూ వచ్చాడు ఈమధ్య వాడిమీదొక కేసు విఱుచుకు పడ్డదట.

నాగే—దిక్కు మొక్కు లేని వాళ్ళమీద చాలా కేసులు విఱుచుకు పడతై. పాపంలు నేవాళ్ళు లేకపోతే విఱుచుకుపడవ్వా? పడతై.

తాత—నిజమే రాతండ్రి. అదేమిటో పాపం నేనుగూడా కనుక్కొందామని చూస్తున్నా.

నాగే—నిజంగా బుద్ధిమంతుడికి, విద్యావంతుడికి రోజులు మంచివిగా లేవు. ఇక్కడే కాదు. ఏ దేశంలో నైనా యింతే, గోముఖ వ్యాఘ్రాలకి పయోముఖ విషకుంభాలకి మర్యాద, మన్నన, వుంటున్నది. వాళ్ళ చేతుల్లోనే సర్వాధికారం వుంటున్నది.

తాత—అంతేరా నానా. ఊళ్ళో తిక్కన్న వున్నాడేమో కబురు చేసి పిలిపిస్తా.

నాగే—ఇంకా పిలిపిస్తే వచ్చే అందుబాట్లో యెక్కడున్నాడు? ఉండనిస్తారు? పేదమీదిమీద కేసు పెట్టడం, యింకా బైటికి రానీయటం వుంటుందా? నట్టింది. దాంతో పేదవాడి ప్రాణాలు తీయందే వదలి పెడతారా?

తాత—యదార్థం గూడా అంతే. అయినా పోయి కనుక్కొస్తా.

(నిష్క్రమించును)

నాగే—కన్నతండ్రినిగూడా కట్టుకొని కపటనాటక మాడుతున్నది పాపిష్టికాలం. న్యాయంచెప్పేవాళ్లెరి? న్యాయంవరకుచెప్పుతా రని నమ్మివుండకూడదు. కడుపునిండా అమృతాన్నం పట్టించి కమ్మని సుగంధాలు వంటినిండా పులుముకొని చక్కనికుసుమ శయ్యలపై పొర్లాడుతున్న వాళ్ళని అసలే నమ్మకూడదు, ఆ జాతినినమ్మి నీతికోసం గోతిలోకి దూకగూడదు. సుకుమార వనితాలోకం అంతఃపురాల్లోవున్న పర్యంతం న్యాయం, ధర్మం మచ్చుకైనా దొరకదు. దొరికితే వాళ్ళసౌకుమార్యానికి సర్వ సౌఖ్యాలకి, యెక్కడా తావుండదు. ఏనాడు సుకుమార మహిళా ప్రపంచం. తన అభీష్టాలు తీర్చుకొంటానికి ఆజ్ఞా బంధనాలచే భర్తను బంధిస్తుందో, ఆనాటినుంచి అగ్నిపర్వ తాలు పగిలి, చతుస్సముద్రాలుపొంగి, అఖండ భూమండలం క్రుంగి. నానాప్రాణికోట్లు హాహాకారాలతో అయిపులేకుండా అంతర్ధానం కావలసి వస్తుంది. ఏనాడు మితిమీరని కోరిక సుఖం లేకుండా చూచుకొంటుందో లోకం, ఆనాటినుంచి చల్లగా ప్రశాంతంగా వుంటుంది. అంతవఱకెంతెంతమహా త్ములు వర్తమానకాలంలో పుట్టుకొచ్చినప్పటికి ప్రయోజనం కనపడదు. పేదవాడి మొర చెవిని పడదు. పాపంకష్టకాలం లో ప్రాణ స్నేహితుడి కోసం ప్రాణా లేడిపిస్తే.

పచ్చగ నుండునాడు పరు
వంబును దప్పని పూల తావిగా
వచ్చు సఖుండు, కమ్మని సు
వాక్కులచే బులిపించు; కష్టముల్
వచ్చి దహించు నాడతడె
పల్కడు ప్రక్కకు రా సహించడీ

మచ్చు జనించియున్న యుగ
మందుహితుం డెవండంచు నెంతురే?

కనుక నే నానాకష్టాల్లోం బడ్డ తిక్కన్నకు దిక్కూ దివాణం లేకుండా పోయింది. ఆపదలో అడ్డుకోలేని వాండెంత స్నేహితుండైతే మట్టుకు ప్రయోజన మేముంది? ఎంత రసవంతమైన హక్కుగల చెలికానిని, కవిసార్వభౌముణ్ణి కష్టాల్లో పడేసి, దేశద్రిమ్మరినై భోగలాలసుణ్ణై మైమఱచాను!

[లక్ష్మి ప్రవేశం]

లక్ష్మి—ఇంత కాలానికి జ్ఞాపకం వచ్చిందా?

నాగే—ఎవరు?

లక్ష్మి—ఎవర్ని చేసుకొన్నారో వారే.

నాగే—వారన్న వారెవరు! వారెప్పుడైనా నన్నెఱుగుదురా?

లక్ష్మి—చేసుకొన్న వారెఱుగనప్పుడు పూనుకొన్నవా రేమెఱుగుదురు?

నాగే—నేనేం చేసుకోలేదు. నీవేం పూనుకోవద్దు.

లక్ష్మి—వద్దన్నా, కద్దన్నా, కట్టుకొన్న దేమిటి?

నాగే—గుదిబండ.

లక్ష్మి—దాన్నెందుకు కట్టారో తెలుసా?

నాగే—కాళ్ళకు కట్టుకొంటానికి.

లక్ష్మి—కాదు, దేశాల్మీదికి లేచిపోకుండా వుంచటానికి?

నాగే—అం హాం! లేచిపోకుండా ఆపలేదేం?

లక్ష్మి—ఆపలేకపోయినా, తిన్నగా, మళ్ళీ కట్టుకొయ్యకేరప్పించింది.
ఎంత ప్రయోజనముండయిన
నేమి, మఱెంత దిగంత కంతి వి

క్రాంతయశోధనుండయి, ప
సందుగ వెళ్లిన నేమి, సౌఖ్య శు
ద్ధాంతి లతాప్రసూన వనితా
మహితా విరహావలోకరా
ద్ధాంతికళాగృహమ్మునకు
తప్పక చెప్పక దారి తీయఁడే ?

నాగే—నిజమేగాని.

కాలవశమ్ముచే నెచట
కానియు పుట్టక బిక్కమోముతో
గాలికి లేచిపోయెడి య
ఖండ మనీష కళాప్రపంచ ధీ
శాలిని గాలదన్ని, గ్రహ
చారము బాగుగ నుండి, వాఁడె భూ
పాలకుఁడైన పాదములు
వట్టుడి స్త్రీలను నమ్మవచ్చునే.

లక్ష్మి—నమ్మకపోతే నష్టమెవరికి ? విడిచిపెట్టి తిరిగిన వాళ్ళకి పేరూ ప్రతిష్టా యెక్కడిది ? సుఖం యెక్కడిది ?

చక్కని పెండ్లిసంబరము
చల్లనిపందిట శోభఁదెచ్చు, ఆ
చక్కని పెండ్లిపందిరి ప్ర
చండహుతాశనుఁ డెందు ముంచునో
అక్కట యంచు, పందిరి భ
యంబున వేయక మండు టెండలో
చిక్కులు పడ్డవాని బలె
స్త్రీలను నమ్మనివాఁడు పొక్కడే ?

నాగే—ఔనుగాని,

కలికీ! నా విరజాజి పూల చెమికీ!
కల్లోలినీ పల్లకీ!
కలలో, కోకిలకూతలో, తలంపులో
కాంతా సమూహమ్ములోఁ,
దళుకుల్ సుబ్బుచు నొల్కు నీ ప్రణయ
సౌందర్యామృతంబెల్లఁ బె
ట్టుల నిల్పెట్టగవచ్చు, కష్టమిఁక
నిష్ఠూరమ్ము గానీయకే
నిన్ను పడనాడి నేను చేయున దొక్కటైనూ లేదు.

(తెరలోనుంచి పింటు)

(అయ్యా! నాగేశ్వర్రావ్ గారూ! ఒంకోసం నాలాముంది
పేదోళ్ళు వాకిట్లోపడి పోతుత్తుండారు)

నాగే—పాపం ఆ ప్రజ తీవ్రైకంతో వచ్చి వాళ్ళని తొందరగా
పంపించివస్తా, నీవుపో.

లక్ష్మి—మీనాన్నగారు పంపిస్తారులెద్దురూ.

నాగే—అట్లా వద్దు, ఎంతసేపటినుంచో కనిపెట్టుకొనివున్న వాళ్ళకి
మానాన్న చివాట్ల ప్రసాదం పంపించేదా? పాపఖర్మం,
నీవు పో.

లక్ష్మి—(పోతూ) అప్పుడే వచ్చి పడ్డది దిక్కుమాలిన మూక,
(నిష్క్రమించును)

నాగే—అరే! పింటూ! వాళ్ళందర్నీ రమ్మను.

(తెరలో పింటు సిత్తం అనును)

నాగే—మానవ జాతికి, తదితర జాతికి దయాదాక్షిణ్యామె, ఎక్కువ తేడా చూపిస్తున్నది, ఆ దయాదాక్షిణ్యాలు లేకపోతే మానవులే కాదు, అదోక అధమ జాతిగా చూచుకోవలసిందే. స్వభాష, స్వదేశము, బాగుపడినప్పుడు గాని, విశ్వమానవ కళ్యాణం జరగదు.

[పేదవాళ్ళు, పింటు ప్రవేశం]

పింటు—హారేయ్! నోరెత్తకుండా నిలబడండిట్టా,

పేదవాళ్ళు—అయ్యా! దణ్ణాలు, మా వృత్తులు చితికిపోయినై. మా గ్రామాలు పాడుపడ్డై, మా భాష నాశన మైంది, మా పిల్లా జెల్లా మీ మీద చూపు పెట్టుకొని వున్నాం.

నాగే—సరే; మీ మీ వృత్తులకు, స్వభాషలకు, స్వసంఘాలకు 50 వేలు శాంక్షన్ చేస్తున్నాం. తర్వాత వచ్చి తీసుకుపోండి.

పేదవాళ్ళు—మహాదాతా! చిరకాలం ఆయురారోగ్య భాగ్యాలతో వర్ధిల్లుము. సెలవు.

నాగే—మంచిది.

(దుర్గ, భారతి, కూలివాడు ప్రవేశించుచుండటం చూచి పేదవాళ్ళు కూడా ప్రక్కన నిలబడెదరు)

(పింటుసాహెబు నివ్వెరపడి చూచుచుండును)

కూలి—బాబయ్యా! దణ్ణాలు.

దుర్గ—బాబూ! దణ్ణాలు.

[తాత ప్రవేశం]

తాత—ఎక్కడిదిరా యీ గుంపంతా.

(తాత రావటంచూచి పింటు లటాలున పారిపోవుచు)

తాత—ఈ ట్రాష్టమ్మొహా లంతా ఎవర్రా? అప్పుడే వచ్చి పడ్డారు పింటూ! పింటో! ఆరి నిన్ను పెద్దపులి తినా, నీ వెక్కడ

చచ్చావురా? వీళ్ళంతా జొరబడుతుంటే నీవెక్కడ మార ణమై—పోయావురా? బాగానే వుంది. అరి అబ్బీ! మీకు వేళా పాళా అంటూ లేదా యేమిటి!

కూలి—కల దమ్మపబువులకి కోపం వస్తే పేదముండాకొడుకులం మే మెట్టా బతకాలా బాబో?

తాత—మేం మీ కోసమే బ్రతికామన్నమాట. పైగా మాట్లాడ తారేం మొహానికి సిగ్గన్నా లేక అప్పుడేపుట్ట పగులకొట్టు కొని బయల్దేరింది. మాయదారిగుంపు మెత్తనివాణ్ణి చూస్తేసరి పీక్కు తినటమే వీటిపని. పోతారా పోరా? పెంటు! పెంటో?

నాగే—నాన్నగారు! మీరే రొష్టు పడకండి. పెద్దలైనారు.

తాత—ఊరుకొంటే యెట్లారా! వీళ్ళు నన్ను బ్రతుకనిస్తారా?

నాగే—మీ కెందుకు మీరు మీ జపంలో వుండండి నేనుపంపిస్తా.

తాత—ఇంకా యీ ముద్రష్టపు మూకవల్ల నా జపం యేం సాగు తుంది? ఒకటే మాయదారిగోల, దోచుకుపోవటానికి.

నాగే—(చేతులు పట్టుకొని) మీరింట్లోకి పొండి.

తాత—ఇంట్లోకిగాదు ఈపాపిష్టిమూకతో యేట్లోకేపోవాలి. ఇల్లు గుండం వేసిగాని యీమాయదారిగుంపువదలిపోదు కాంబోలు.

(నిష్క్రమించును)

నాగే—ఎవర్రా! అబ్బి మీరు?

కూలి—మేం కూలోళ్ళ మండి.

నాగే—ఏం పనుండి వచ్చారు?

కూలి—అయ్యో! ఈమాతల్లి మీయింటికాడ పెరిగిన బారతమ్మండి

నాగే—(ఆశ్చర్యంతో లేచివచ్చి) మా భారతా! మా ఆంధ్రభారతా (దగ్గఱకు దీసుకొని) అమ్మా! ఆంధ్రభారతి! ఈ ధనమదాంధులవల్ల యెంత కష్టాల్లో పడిపోతివమ్మా?

దుర్గ—నట్టేట్లోబడి కొట్టుకు పోతుంటే యీ భారతమ్మ వెనివిఁటి
చిక్కన్నగారు బ్రతికించి మాకొప్పఁజెప్పారయ్యా!

చక్కనికీర్తి సౌధము వ
సందుగఁ గట్టి గులాబి తోటలోఁ
పెక్కరకాల పూల హిమ
బిందులు చిల్కెడి కన్నతల్లి నేఁ
డెక్కడ దిక్కులేక పడి
యేడ్చుచు నచ్చి కళాప్రపూర్ణ! నీ
దుక్కటి దున్నచే ప్రళయ
తోయధిలోఁ బడిపోయె నక్కటా.

నాగే—అమ్మా! ఆంధ్రభారతీ!
ఇలనై స్నిగ్ధ సువర్ణ వాఙ్మయ కళా
పేఁటా మహోద్యాన గ
న్న లతాహర్మ్య రసాల సాలపికమా!
నా ఆంధ్రమాణిక్యమా!
ఖలులై గిట్టని కాకులై కృపణులై
గర్వాంధులై లేచి, గం
గలో నిన్ ద్రోసినవారి దగ్గఱకు
శోకం గార్చుకో వచ్చితే?

భార్య—అన్నయ్యా! నా శోకాగ్ని యీనాఁడు చల్లారేది కాదు.
చేతన్ గవ్వయులేక బంధుగుల దృష్టిన్
బిచ్చియాకారమై
శ్రోతల్ మెచ్చెడి ఆంధ్రవాఙ్మయ కళా
శుభ్రాంశుఁడీ బ్రాహ్మణై

చేతుల్ రెండును ఖండ ఖండములుగా
ఛేదించుకో నుండెనో
దాతా! నాపతిభిక్ష పెట్టి యింక
ఆంధ్రత్వంబు నిల్పెట్టుమా.

ఈనాటిదాంకా నన్ను కాపాడుకొన్న యీ కూలితంద్రన్ని గూడా రక్షించుము.

కూలి—అయ్యా! దొరగోరు! ముందు తిక్కన్నగోరి సిచ్చ తప్పించండి, మాకదే పదివేలు.

దుర్గ—అయ్యా! ఈఆంధ్రభారతి ఆకవి సార్వభౌముండైన తిక్కన్న గార్ని రక్షిస్తే దేశమంతా చల్లబడుతుంది.

నాగే—నాయకులారా! నా ఆంధ్రసోదర సోదరీమణులారా! నా ప్రాణాలు ధారవోసైనను, తిక్కన్న శిక్ష తీసివేయింతును. రండి, ఆ ఘాతుకుండెవరో కన్నను నా ప్రతిజ్ఞ తప్పను, కనుమూయను.

ఆ భువనైకదివ్య వన
హార్మ్య మనోహర కావ్యరాజ మ
స్తేజము పైన నెక్కి కళ
లేలెడి చక్కని తెన్గుతల్లికై
ముఖలువోయి చావంబడు
శూరులు కోసము సర్వలోక సం
క్షోభము లేపి నేడు పడం
గొట్టెద కోటలు పాడుజూచుడీ.
(నిష్క్రమింతురు, తెర పడును.)



## 2వ రంగం

[తిక్కన్న చేతులు ఖండించు ప్రదేశం]

భీకరాకారులై ఖడ్గపాణులు యిరుప్రక్కల నిలబడెదరు.

[సంకెళ్ళతో తిక్కన్న ప్రవేశం]

తిక్క—ప్రళయ కాల చక్రాన్ని ఆపటం అసాధ్యం. అనివార్యం. సువర్ణరత్న ఖచిత సింహాసనా లధిష్ఠించు ప్రభు లోకాన్ని మంచి మార్గానికి రప్పించటం దుర్ఘటం, దుర్లభం, ఏ ఘటికుఁడు, ఏ అభినవ చాణక్యుఁడు, ఏ మహా యుగంధరుఁడు నేఁడీ దుర్భర కార్య నిర్వహణకి, పనికిరాఁడు. నిలువలేఁడు. లోకంలో ధర్మదేవతాబలం తగ్గి స్రగ్గి మ్రగ్గి పోయింది. ధర్మ వాక్యం రుచించదు. ఈ మార్కెట్టులో నీతి వాక్యాలమ్ముడు పోవు. ఆజంగిడీ దింపనీయరు. ఆ కేక వేయనీయరు. ఈసంగతి తెలిసి, ఒళ్ళు బలిసి వచ్చిన దానికి తప్పించు కొందామని చూచారు గాబోలు. నీయెత్తులు జిత్తులు యీ కసాయి కత్తుల ముందు నిలుస్తె యని వుప్పి ళ్ళూరావు కాఁబోలు. పటాపంచలు గాక మానవు. లక్ష్మీదాసులు పరిపాలించు రాజ్యంలో, ఆ లక్ష్మిని కాలఁదన్ని, ప్రాణాలతో వుందామని వూహించితిరా? గర్వించి, నిరంకుశించి, గర్జించి, లంఘించితివా ? ఓ అమాయకపు కవి సింహకిశోరమా? బోనులో పడితివేమి? డొక్కలెండుకుపోయి చిక్కిపోతివేమి ? నీ ప్రళయగర్జనకి. నీ ప్రచండ ప్రతిజ్ఞకి, తగినశిక్షాప్రసాదం ప్రసాదించు ఘడియలువస్తున్నె నీ కుసుమకోమలికి, నీఆంధ్రభారతికి, యేగతి పట్టునో తెలుసుకొంటివా ? ఈ భయంకర మారణ నిశితఖడ్గాలు ఝుళిపించునప్పుడుగాని తెలుకోవు. ఈ సుకుమార కవితారాజ్యంలో

వాఙ్మయ పీఠమెక్కి శాసనాలు శాసించు నీసుస్నిగ్ధహస్తాల్ని ఖండఖండాలుగా ఖండించు నప్పుడుగాని బాపురు మనవు. ఎవరికీ లేని నిరంకుశత్వం అసమానభాషాప్రభుత్వం నీకెందుకు ఆవంక చూడు! లక్ష్మీదాసులకు బానిసలై బానిసకవిత్వంతో బానిసభాషా ప్రభుత్వంలోఁ బడి యెంతెంత హోదాలతో యెంతెంత అనుపమాన బిరుదాంకితులై యెంతెంత డిగ్రీలు కలవాళ్లై పొట్టపోసుకొనుచున్నారో చూచితివా? నీవు వాళ్ళ సాటివాఁడవుగావా ? నీవీ చిత్రవధకు మురిసిపోతుంటివేమి ?
* నీచిక్కని నెత్తుటిబొట్లతో స్వదేశ మాతృపాదారవిందాల్ని పూజించుటకు పోవుచుంటివా ఎందుకీ శ్రమ ? ఎవరుచూచి *
ఆనందిస్తారు ? ఏమాత్ర ప్రత్యుపకారం లేనిప్రాతలుకూతలు కట్టిపెట్టి బానిస కవిత్వం చెప్పుకొనిబ్రతకటానికి, భగవంతుణ్ణి సహాయం వేడుకోరాదా ? చెడతావు, నీకింత తలబిరుసుతనం పనికిరాదు. తర్వాత నీమొండి చేతులతో, దేన్నీ వుద్ధరించలేవు. ఎందుకీ దురభిమానం ? దుర్గర్వం? దురవస్థ? ఛీ! పాపిష్టి వెధవ ! పాడు పొట్టకోసం ఎంతక్రూర వ్యాఘ్రాల ధర్మం బోధిస్తున్నావురా ?

ఇడుములలోన నల్గి కడు
హీనముగా నులిమై యసహ్యమై
అడుసును ద్రొక్కి, క్రుళ్ళి యిఁక
నాగటి బెబ్బులినోటఁ జిక్కి, వే
పడి చెడుబొందినిన్ పిడిచి
పెట్ట వదేమిటిరోరి మొండి జీ
వుఁడ ! గతిలేని యీబ్రతుకు
ప్రొద్దుట పొడ్చిర నిము మోమునన్,

తలారీ! వీడు భయంకర భటాచోరుడు. నరహంతకుడు వెంటనే వీడి రెండుచేతుల్నీ ఖండించుము. ఇది రాజాజ్ఞ.

తలారి—చిత్తం ప్రభూ! ఓ తిక్కన్నా! వాగుడు కట్టిపెట్టి రెండు చేతులు జోడించి దగ్గరకు పెట్టు.

(కత్తికి పదును పెట్టుచుండును)

తిక్క—(రెండు చేతులవంక చూచుచు)

చిక్కనిరక్తమ్ము చిమ్మెడి కత్తిలో
జీవకళను బోయు చేతులార!
వైరి గుండియఁజీల్చి వధచేయు కథలోన
సింహగర్జన నింపు చేతులార!
వీరపుత్రుల కీర్తి తోరణమ్ములపైన
జాతిపతాక నెత్తు చేతులార!
దేశమాతృ సువర్ణ దివ్యపాదయుగమ్ము
సేవించి పులకించు చేతులార!

ఈ నిరంకుశ రాజ మత్తేభ జాతి
ఖడ్గదేవత మీదు రక్తమ్ముఁ ద్రావి
దాహశాంతి చేసుకొనంగ దరికివచ్చె
పిరికి పందల ప్రక్కజీవించగలరె?

జాతిపౌరుషం నిలబెట్టుకొనటమే ధర్మం. అధర్మప్రభుత్వాన్ని అరికట్టడమే పురుషలక్షణం. దేశమాత దాస్యశృంఖలాల్ని తెగగొట్టటమే వీరలక్షణం. జాతిగౌరవం కాపాడుకొంటానికి బలికావటమే. స్వర్గసౌధ కవాటాలు తెరవటం.

తలారి—వాగుడు కట్టిపెట్టు. దొరలొస్తున్నారు.

[బొంగ్రన్న శనేశ్వర్రావు ప్రవేశం]

శనే—(వవ్వుచు)

ధనికు లటన్న మండిపడు
   త్రాష్టముఖంబున నెత్తురేది ? వీ
ధిని బడి గ్రామసింహముగ
   దిగ్గజమున్ బెదరించఁబోవు గ
ర్జన లెటువైపునుంచి విన
   రావిటఁ గారణమేమి ? దానికిన్
గనపడె నేమొరా ! తగిన
   కమ్మని పాపఫలమ్ము మిత్రుడా ?

బొంగ్ర—నిజంగా అంతేరా.

అదిగో ! దానికి తిన్నగా నిపుడె ప్రా
   యశ్చిత్త మీా వంక జ
గ్గదె, దుర్గర్వ దురాగ్రహానలము స
   ర్వంబింక చల్లారదే
యెదు రే మాత్రము గూడ మారొ్కనుట కిం
   కెవ్వారి సాధ్యంబుగా
ని, దురంతం బగు రాజఖడ్గమున ఖం
   డింపంగ శాసించరే ?

(శనేశ్వర్రావు బొంగ్రన్న కంటిసంజ్ఞలు చేస్తూ పోవుదురు)

(తలారిగూడా వెంటపోవును)

క్క—ఆహా ! ఎంత సంతోషిస్తున్నార్రా !

ఇతిరా ! గొప్ప కృతజ్ఞతా గరిమ !
   నేఁడీ తెన్ను గడ్డెంత దు
మ్ము దుమారమ్ముగ మారి పో

వలసి మిమ్ముఁ మోసి పోషించు చు
న్నదో; కానిండు మదమ్ముచే
పకపకా నవ్వుండు, నా ఆంధ్ర జీ
వదశాశ్వాసము పాడు వెట్టుఁడు
మహా పాషాణ జాత్యుద్భవుల్.

ఓ కవిసార్వభౌమా ! ఈనాఁడు నీచేతులు మొండివైననూ, నీ వాక్కును కక్కిన కూటికోసం పోనీయక ఈ నీ దేహం కృశించి, జీర్ణించి, శల్యపరంపరమైననూ, లక్ష్మీదాసులకి వంగి సలాము సేయ బోక, నేఁటితో నీ ఆయుర్దాయం తీరిపోయిననూసరే, నీ ఆంధ్రభాషా మతల్లిపై అనురాగం మఱచిపోక, ఇది నీజాతి పౌరుషం: ఇదినీడన్నకి కావలసిన ప్రచండ శపథం. ఇది నీ మాతృదేశారాధన, ఇది నీ సువర్ణ లేఖనీసాధన తెలిసెనా ?

ప్రతిజ్ఞ పాలించుకో లేనప్పుడు మానవుణ్ణని చెప్పుకోవటం సిగ్గుచేటు. దట్టంగా ముసురు పట్టినప్పుడుగాని సెలయేళ్ళు పాఱవు' ఎక్కువగా కష్టాల్లో పడ్డప్పుడుగాని జీవ కవితా ఝరి ప్రవహించదు ఏకష్టాలతో కవితా లతికలకి పూలు పూయించి ఆనందిస్తున్నావో. ఆ కష్టాలు వచ్చినప్పుడుగూడా, ఆనంద భరితుఁడవు గమ్ము. నిశిత ఖడ్గపాణులై భయంకర చిత్రవధ చేయవచ్చుచున్నారు. వీళ్ళ జీవితా లిందుకే వున్నవి.

[తలారి ప్రవేశించి]

తలారి—వాగుడు కట్టిపెట్టి చేతులురెండూ దగ్గఱికి చెయ్యి. (కత్తి దూయును)

తిక్క—పెట్టెదను తండ్రీ ! నా వీరరక్తం వెదఁజిమ్మి నా తెనుఁగు దొరలకు వీరతేజస్సు తెప్పించు తండ్రీ !

[ముకుళితహస్తుడై]

పుట్టితి దేనికో, గుబులు పుట్టిక
　　　　వాని విధమ్ము దేనికో
పొట్టను నింపుకొంటి, యెను బో
　　　　తుగ క్రొవ్వి మదించి దేనికో,
కొట్టుదు కొమ్ములన్ విఱుగఁ
　　　　గొట్టుకొనన్ దగిపోతి గాని యీ
పట్టున నీదు జాతరకు వల్లక
　　　　పోతి స్వదేశ మాతరో.

తలారి—ఆట్టే వాక్కు, చేతులు దగ్గఱికి పెట్టు.

తిక్క—పెట్టుచున్నా తండ్రీ!

ఈనిర్భాగ్యుని చేతిలోఁ బడిన
　　　　వాణీ! ఆంధ్రభాషా మణీ!
యేసీలో జతఁబట్టి చక్కని
　　　　సుఖం బేనాఁడు పెట్టంగ లే
కానట్టేటను ద్రోసితిన్ గదటె? నేఁ
　　　　డద్దానికే శిక్ష కా
దే, నాకంఠముఁ ద్రాఁచి కట్టమనవే
　　　　యీ తెన్గు గుమ్మానికిన్.

(మెడవంచి చేతులు సాచును)

తలారి—దోపిళ్ళు చేసి ఖూనీలు చేసిన దానికి అనుభవించు.

(నరక బోవును)

(తెరలోనుంచి)

తలారి ! ఆగుము, ఆగుము, ఇదిగో రాజాజ్ఞ. (అంటూ)
[నాగేశ్వరరావు, కూలి, తాత, భారతి ప్రవేశించి చేతులు
పట్టుకొనెదరు]

తిక్క—(ఆవేశంతో)

అడ్డము రాకుఁ డెవ్వరు మహా
కఠినాత్ముఁడు వీఁడు, ఆంధ్రిపై
బడ్డ విపత్పరంపరకు ప్రాణము
తీసెడి ఘాతకుండు, పే
ర్వడ్డ స్వతంత్ర రాజ కరవాల
నిరంకుశ ధారకింక, క
న్పడ్డ క్షణమ్ములో విడువ వచ్చునె
విడ్చిన దక్కనిచ్చునే ?

నాగే—(పట్టుకొని) ఆంధ్రకవిసార్వభౌమా ! క్షమించుడు. ఈతప్పం తయు ధనమదాంధకారంలో వున్న లక్ష్మిది. అమాయకు డైన నాతండ్రిది.

తాత—నిజమే తండ్రీ ! బుద్ధి గడ్డితిని చెప్పుడుమాటలు విని, నీ మహాత్తు, మంచితనం తెలుసుకోలేక పోతిని.

నాగే—అనతి కాలంలో నీ కష్టాలు తీర్చలేనందుకు నన్నుగూడా క్షమించుము (భారతిని తీసుకొని)

ఇదిగో ! నీ సుగుణ ప్రసూన కవితా
హేమాక్షి నీ కోస మ
ల్లదిగో ! ఆ కూలి కుటీర దంపతికృపా
వ్యాసంగియై వాడి యు

న్నది, యీ తెన్గు పడంతి నోము లీక
పండన్ నీవు గైకొమ్ము నీ
మృదు మాధుర్య రస ప్రవాహమున
తండ్రీ! ఆంధ్రకవ్యగ్రణీ!

(ఆంధ్రభారతిని తిక్కన్న కిచ్చును)

క—ఈ దిక్కు లేని వాళ్ళు నీ బుణ మెట్లా తీర్చుకోగలరన్నయ్యా?

శాశ్వత కీర్తి సౌధమున
చల్లని కమ్మని చూడ్కి రాజ రా
జేశ్వరి పైఁడి దీవెనల నిచ్చి య
జేయుని జేసి నీకు భూ
మీశ్వరు లాగ లేని సిరు
లింటను నోంటను జూపుఁగాంత; నా
గేశ్వర! విశ్వదాతవయి
యెత్తుకొనంగదయ్య భూమినిన్.

ల—నీవంటి ఆంధ్రపుత్రుఁడు జాతి గౌరవం నిల్పెట్టినందుకు
సార్థకమైనది జన్మ.
ఏ పూఁతఁ బట్టిన యిగురు మామిడి మీద
చిన్నికోయిల రాణి నిన్ను గనెనొ
ఏ పచ్చని పొలాన హిమబిందు సుందరి
గుమ్మపాలను నీకు కూర్మి నిడెనొ
ఏ యమృత ధునీతుహిన సైకతస్థలి
నీకు చల్లని గాలి తాఁకఁబడెనొ
ఏ మొల్ల చివురించి కోమలమ్ముగ నేఁడు
కమ్మని పూలవర్షమ్ము నీ ప

యి, గురిపించు చుండెనో, పొంగులెత్తి పార్లి
పరుగులెత్తించు, యే యశోవాహినీ ప్ర
వాహ మఖిల దేశాలలో వఱద పట్టి
వేసెనో, ధన్యుఁడవు నీవు విశ్వదాత.

[లక్ష్మి పూలహారాలు తీసుకొని కీర్తన పాడుకొంటూ వచ్చి ఆంధ్ర
భారతిని తిక్కన్నని పుష్ప మాలాలంకృతులను చేయును.
అందఱూ కలసి కీర్తన పాడుదురు]

తెనుఁగుతోట తెనుఁగు తేట
తెనుఁగు తల్లి నోముల పంట
జీవ కవితాఝరిచే
కాచుకో చూచుకో
ఆంధ్రకవి రాజకుమారా
అఖిల రాజ్య యశోవిహారా ॥ తె॥
మంగళం, మంగళం, మంగళం, మహాత్.

సంపూర్ణము.

